# మన సమస్యలు - మంత్ర సాధనలు































కుర్తాళం శంకరాచార్య, జగద్గురు
**శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామి**

పంచమ ముద్రణ: 2020

వెల :రూ. 100/-

పుస్తకములు లభించు చిరునామాలు

1) మేనేజర్, మంత్రాశ్రమం,
4వ లైను రవీంద్రనగర్, కొత్తపట్టాభిపురం,
గుంటూరు - 522 006, ఆంధ్రప్రదేశ్.

2) మేనేజర్, శ్రీ సిద్ధేశ్వరీపీఠం
కుర్తాళం - 627 802. తమిళనాడు

3) సెక్రెటరీ, శ్రీ సిద్ధేశ్వరీపీఠం ఛారిటబుల్ ట్రస్ట్
ప్లాట్ నెం. 87/బి; డోర్ నెం. 11-12-13,
రోడ్ నెం. 1, శ్రీరామకృష్ణాపురం
కొత్తపేట, హైదరాబాద్ - 500 035. తెలంగాణా

పుస్తకములను, మీ చిరునామాకు పంపించుటకు వివరములు

**Mantra - e-store**

Email Address : courtallamswamijisbooks @ gmail.com

**Online Store Address:**

https://mantra-estore-myshopify.com//

**Phone Numbers :**

1) **Andhra Pradesh**
Phone Number : 0-9063701687
Whatsapp Number : 0-9063701687

2) **Telangana :**
Phone Number : 0-8977788055
Whatsapp Number : 0-8977788055

3) **USA :**
Phone Number : 001-678-643-8133
Whatsapp Number : 001-678-643-8133

# మా వద్ద లభించు గ్రంథములు

స్వామివారి రచనలు

1) అమెరికాలో దేవతలు
2) తాంత్రిక ప్రపంచం
3) దశమహావిద్యలు
4) ప్రత్యంగిరా సాధన
5) లలితాదేవి చరిత్ర
6) బృందావన భాగవతం
7) హిమాలయ సిద్ధులతో మౌనస్వామి
8) కాళీసిద్ధులు
9) భైరవసాధన
10) నాగసాధన
11) కుర్తాళ యోగులు
12) కవిబ్రహ్మ
13) కావ్యకంఠ
14) మన సమస్యలు-మంత్రసాధనలు
15) సిద్ధాశ్రమ యోగులు
16) సిద్ధేశ్వరయానము (శ్రీ స్వామిజీ వారి 5వేల యేండ్ల చరిత్ర)

మాతాజీ రమ్యానందభారతీస్వామిని రచనలు

1) Mystic Monk of Courtallam
2) మహిమాన్వితయోగి - స్వామి సిద్ధేశ్వరానంద
3) గురుదేవోభవ
4) శ్రీ సిద్ధేశ్వరీ పీఠవైభవము

# విషయ సూచిక

**అగ్ని యంత్రము**



# 1. సాధన విధానము

దేవతానుగ్రహం సాధించి ఇష్టసిద్ధిని పొందాలనుకున్న వ్యక్తి ముందు తన ప్రయోజనమును ఏ దేవత త్వరగా నేరవేర్చ గలదో జాగ్రత్తగా ఎన్నుకోవలెను. వైరాగ్యము, జ్ఞానము పొంది బ్రహ్మానుభవము లేక ముక్తిని అందుకోవాలనుకున్నవారు శాంతవిద్యలను వారి వారి సంప్రదాయము ననుసరించి ఎన్నుకోవాలి. శైవులు పంచాక్షరిని, వైష్ణవులు అష్టాక్షరిని శాక్తేయులు గాయత్రి, లలిత మొదలగు విద్యలను ఆశ్రయించాలి.

**గురువెవరు ?**

ఏ మంత్రమైనా తగిన గురువు దగ్గర ఉపదేశం పొందాలి. తాను కోరిన మంత్రమును సిద్ధిపొందిన సద్గురువు కోసం అన్వేషించాలి. కానీ ఈ కాలంలో సిద్ధులైన మహనీయులు లభించటం చాలా కష్టం. కనుక ఏదో మంత్రసిద్ధి పొందిన వ్యక్తి దొరికితే అతనికి ఇతర మంత్రాలను కూడా ఉపదేశించే అధికారం కొంత ఉంటుంది కనుక – అటువంటి వారి దగ్గరకు వెళ్ళి కావలసిన మంత్రాన్ని ఉపదేశం పొందాలి. ఒక వేళ ఎవరిమీదా గురి కుదరకపోతే ఎలా అన్న ప్రశ్న ఉదయించవచ్చు. నిజమే చాలా సందర్భాలలో కొందరు దూరంగా ఉన్నప్పుడు పరిస్థితి వేరు దగ్గరకు వెళ్ళిన తర్వాత ఆ వ్యక్తిలో లోపాలు తెలుస్తున్నప్పుడు గౌరవం సడలుతుంది. ఇన్ని దోషాలున్న వ్యక్తినా నేను గురువుగా ఎన్నుకొన్నది అని బాధ కలుగుతుంది.

**ఆచార్యదేవోభవ !**

వేదం – తల్లిని, తండ్రిని, ఆచార్యుని, అతిథిని, దేవునిగా భావించమని చెప్పింది. సూత్రప్రాయంగా ఇది గొప్ప మార్గం. అంటే వారు దేవుళ్ళు కాకపోయినా సాధకుడు – ఆ విధంగా భావించగలిగితే అతనిలోనికి దైవత్వం త్వరగా వస్తుంది. పనికిమాలిన, దుర్గుణయుతులైన భర్తలను సేవించిన పతివ్రతలు తమ తీవ్ర భక్తివలన దివ్యశక్తులు పొందిన కథలెన్నో పురాణ గాథలలో వింటాము. నిజమే ! కాని ఆచరణలో అంత సులభం కాదు. కాబట్టి అంత ఉన్నత భావన లేకపోయినా తనకు విద్య నిచ్చిన గురువు – ఆ విద్యలో నిష్ణాతుడైతే అతని ఇతర జీవిత భాగాలలో ఎలా ఉన్నా గౌరవాన్ని భావించవచ్చు.

**శివుడే గురువు**

మేరు తంత్రములో ఒక పద్ధతి చెప్పబడింది. సాధకుడు మంత్రశాస్త్రములు చదువుకొని తాను చేయదలచుకొన్న మంత్రాన్ని ఎన్నుకొన్న తర్వాత సరియైన, నచ్చిన

గురువు దొరకకపోతే ఆ మంత్రాన్ని ఒక పత్రంపై వ్రాసి శివాలయానికి వెళ్ళి మహాదేవుని పూజించి ఆ లిఖిత పత్రాన్ని శివలింగం ముందుంచి కుంకుమాదులతో అర్చించి పరమేశ్వరుని నుండి దానిని స్వీకరిస్తున్నట్లు భావిస్తూ కళ్ళకద్దుకొని ఆ క్షణం నుండి శివోపదేశంగా భావించి జపించవచ్చు. స్వప్నదత్తములైన విద్యలకు కూడా గురూపదేశం తీసుకోవటం అవసరమని కొన్ని గ్రంథాలలో చెప్పబడింది. శ్రీహర్షుని నైషధంలో సరస్వతీదేవి నలచక్రవర్తికి మంత్రాన్ని ఉపదేశించి నేను ఇచ్చినా సకీలకంబుగా సంప్రదాయ క్రమంబున సిద్ధ సారస్వతసంసిద్ధి కారకంబయిన యిమ్మహావిద్య నెరింగి కొనుము – అని నట్లు వ్రాయబడింది. అయితే దీనిని ఎక్కువమంది అంగీకరించరు. కలలో ఏ సిద్ధుడో దేవతో మంత్రోపదేశం చేసిన తరువాత మళ్ళీ లౌకిక గురువుల యొక్క ఉపదేశం అవసరం లేదనేది ఉచితమే.

**పురశ్చరణ**

మంత్రం ఉపదేశం పొందిన తర్వాత శాస్త్రములో చెప్పబడిన విధంగా పురశ్చరణ చేయాలి. పురశ్చరణ చేయని మంత్రం ఫలించదు. ఏ మహాసిద్ధుడో శక్తిపాతం చేసి తన తపస్సు యొక్క ప్రభావము వలన వరప్రదానం చేస్తే సాధకునకు వెంటనే మంత్రసిద్ధి కలుగవచ్చు. పూర్వకాలంలో రామాయణ భారతాది గ్రంథములలో పరశు రాముడు విశ్వామిత్రుడు, ద్రోణుడు మొదలైన వారు శిష్యులకు అస్త్రము లుపదశించారు. ఆ క్షణం నుండి శిష్యులకు అవి పనిచేసేవి. వారెవ్వరూ ప్రత్యేకంగా వాటి కోసం జపసాధన చేసినట్లు చెప్పబడలేదు. యుగధర్మం, గురుశక్తి వాటికి హేతువులు.

**సామాన్యంగా పురశ్చరణ అయిదుభాగాలు :** 1) జపము 2) హోమము 3) తర్పణము 4) మార్జనము 5) సమారాధనము. మంత్రశాస్త్రములో ఆయా మంత్రాలకు జపసంఖ్య నిర్దేశించబడింది. జపసంఖ్యలో పదవ వంతు హోమము, హోమసంఖ్యలో పదవవంతు తర్పణము, తర్పణ సంఖ్యలో పదవవంతు మార్జనము, మార్జనములో పదవవంతు సమారాధనము. గ్రహశాంతి మంత్రములలో జప సంఖ్యలో పదవవంతు తర్పణము, అందులో పదవవంతు హోమం చేయటం ఆచారంగా ఉంది. ఉపాసనలో మాత్రం జప దశాంశ హోమం అవసరం. హోమమే అత్యంత ప్రధానమైనది. ప్రాచీన కాలంలో ఋషులంతా యజ్ఞములు చేసి ఎంతటి అసాధ్యమైన పనినైనా సాధించారు. ఒక విగ్రహంలో కంటే, యంత్రంలో కంటే కూడా అగ్నిలోకి రావటానికి దేవతలు ఇష్టపడతారు. ఎందుకంటే అది వారి సహజశరీరం కనుక. దేవతలు తేజశ్శరీరులు కదా ! అందులోనూ కలియుగంలో హోమము చేయక మంత్రసిద్ధి కలగటం కష్టం.

హోమం తర్వాత తర్పణం చేయాలి. తర్పణమంటే దేవతను తృప్తిపరచటం ఆ పిదప మార్జనం – పువ్వుతో మంత్రం చెపుతూ నీళ్ళు చల్లాలి. కొందరు మార్జనం బదులు అభిషేకం చేస్తారు. అనంతరం సమారాధనం – శిష్టులైన వ్యక్తులను ఎన్నుకొని వారిని దేవతా స్వరూపులుగా భావించి పూజించి వారికి సంతృప్తిగా భోజనం పెట్టి ఆశీస్సులు తీసుకోవాలి.

**సాధన స్థలం :** దివ్యక్షేత్రాలలో సిద్ధాశ్రమాలలో, పుణ్యనదీతీరాలలో, పర్వతాగ్రముల మీద వేగంగా మంత్రసిద్ధి లభిస్తుంది. సిద్ధపురుషుల సమాధుల దగ్గర సాధన చేస్తే చాలా శీఘ్రంగా ఫలితం వస్తుంది. కాళీ, తారా, భైరవ, బేతాళాది సాధనలకు శ్మశానం తగిన చోటు. అది సాధ్యం కాకపోతే కపాలాసనం మీద చితాభస్మధారణ చేసి కూర్చోవచ్చు. యక్షయక్షిణీ విద్యలకు రావి, మర్రి చెట్ల క్రింద కూర్చుండి చేయటం అవసరం. ఆయా మంత్రాలను బట్టి వివిధ వృక్షాలను ఆశ్రయించవలసి ఉంటుంది. ఏదైనా వీలైనంత ఏకాంత ప్రదేశం అవసరం. గదిలో చేసేవారు గది మొత్తం గోడలతో సహా దేవత శరీర వర్ణం ఉంటే మంచిది. ధరించే వస్త్రములు, మాలలు, పూలు, నైవేద్యములు ఆ రంగులో ఉండాలి.

**సమయం :** తీవ్రసాధకులు లక్షలు కోట్లు జపం చేసేవారు రాత్రింబగళ్ళు చేస్తుంటారు. పరిమిత సమయాలలో చేసే వారు బ్రాహ్మ ముహూర్తములో అంటే తెల్లవారుజామున లేచి సూర్యోదయం వరకు చేయవచ్చు. అది ప్రశస్తమైన వేళ. రాత్రి మొదటి జాము తర్వాత ఒకటిన్నర జాము అంటే నాలుగున్నర గంటలు కూడా చాల శక్తిమంతమైన సమయం. తీవ్రసాధనలకు ఆ సమయం ఎంతో ఉపయోగకరమైనది. ఏదైనా జనులు నిద్రించేవేళ వాళ్ళ భావతరంగాలు ప్రసరించని సమయం, స్థలం, సాధనకు సహకరిస్తవి. ఏకాదశి మొదలగు పుణ్యతిథులు సాధనకు మంచివి. కృష్ణాష్టమి నుండి మాసశివరాత్రి వరకు రాజస, తామస విద్యలకు దీక్షాసమయం. అలానే అమావాస్య చాలా శక్తిమంతమైనది.

**ఆసనం :** నేల తగలకుండా పీటగాని, చాపగాని వేసుకొని కూచోవాలి. చిత్రాసనము, దర్భాసనము, శుభ్రవస్త్రము కాని పైన వేసుకోవాలి. సాత్విక శాంత విద్యలకు జింకతోలు (కృష్ణాజినము), తీవ్ర విద్యలకు పులితోలు (వ్యాఘ్రాజినము) ఉపయోగించవచ్చు. ఆసనం క్రింద కూర్మయంత్రం వేసుకొని కూర్చోటం శీఘ్ర సిద్ధి ప్రదము. తామసవిద్యలకు శ్మశాన వస్తువులు ఉపయోగిస్తారు. పంచకపాలాసనం, నవముండీ ఆసనం – శవంమీద, శవమును పూడ్చిన సమాధిమీద చితాభస్మాన్ని

ఆసనం క్రింద వేసుకొని, ధరించి చేస్తారు. శవంమీద కూర్చుండి సాధన చేసేవారు వీలైనంత క్రొత్తశవం మీద కూర్చోవటం వేగసిద్ధి ప్రదము. పూడ్చిన మూడురోజుల వరకు నీలతేజోవలయం శవాన్ని ఆశ్రయించి ఉంటుంది. దానిపై కూర్చొన్న సాధకునిలోనికి మంత్రజపం వల్ల అది ప్రవేశిస్తుంది.

**గ్రహణ ప్రభావము :** సూర్యచంద్రగ్రహణాలలో ఏది వచ్చినా గ్రహణం పట్టిన దగ్గర నుండి విడచిన దాకా ఒకే మంత్రం జపం చేస్తే అది ఒకపురశ్చరణతో సమానం. ఆ సమయం అసురశక్తులు అంటే రాజస తామస శక్తులు విజృంభించే సమయం. కనుకనే సాత్విక శక్తి కేంద్రాలయిన దేవాలయాలన్నింటిని మూసివేస్తారు. రాజస తామస విద్యలు సాధన చేస్తే ఆ సమయం శీఘ్ర సిద్ధిని కలిగిస్తుంది.

**జపగణననము :** మరీ వేగం కాని మరీ నెమ్మదిగా గాని కాక సమవేగంతో మంత్రజపం చేయాలి. లెక్కపెట్టుకోటానికి మాల అవసరం. సాత్విక విద్యలకు తులసిమాల వాడాలి. రామ, కృష్ణ నారాయణాది మంత్రముల కిది తప్పనిసరి. శైవ శాక్తేయములకు రుద్రాక్షమాల. జ్ఞానానికి స్పటికమాల, మనశ్శాంతికి ముత్యాలమాల, ఐశ్వర్యానికి పగడాలమాల, వివాహానికి స్తంభనానికి పసుపుమాల, తామసవిద్యలకు అస్థిమాల వాటిలో సర్పాస్థిమాల మరింత శక్తిమంతమైనది. సంతానానికి తామరగింజల మాల. ఉగ్రవిద్యలకు మిరియాలు, మిరపకాయలు – ఈ విధంగా వస్తు గుణాన్ని బట్టి ఉపయోగించాలి. దేవత శరీరవర్ణం బట్టి ఆ రంగు పూసలమాల ఉపయోగించటం సముచితము. జపం చేసే మాలలో మంత్ర చైతన్యం కొంత ప్రవేశిస్తుంది. కనుక దానిని జాగ్రత్తగా పూజామందిరంలో ఉంచి జపసమయంలో వాడుకోవాలి. దీనిని ధరిస్తే ఇతరులను తాకినపుడు ఆ శక్తి నష్టమవుతుంది. ధారణకు కావాలంటే వేరేమాల వాడుకోవచ్చు.

జపమాలను ఉంగరపు వేలిపై ఉంచి బొటనవేలు మధ్యవేలు ఈ రెంటితో సాధకుడు తనవైపు పూసను లాక్కోవాలి. కొలికిపూస లేక మేరువు వచ్చినపుడు దానిని దాటకుండా మాలను వెనుకకు త్రిప్పుకొని మొదలు పెట్టాలి. చూపుడు వేలు తగలరాదు. మారణాది ప్రయోగాలకు చూపుడు వేలును ఉపయోగించవచ్చు.

**ఉచ్చారణ:** వాచికము, ఉపాంశువు, మానసికము. పైకి స్పష్టంగా పలికితే వాచికము. వేదమంత్రములకు ఉదాత్త, అనుదాత్త, స్వరిత భేదములతో స్వరం ఉంటుంది. సరియైన స్వరంతో ఉచ్చరిస్తే మంత్రం వేగం సిద్ధిస్తుంది. పూర్వం గాయత్రీ

మంత్రాన్ని సామూహికంగా ఉచ్చరింపచేసేవారు. అందుకే కాబోలు ఆ మంత్రంలో ధీమహి అని బహువచన క్రియ కనిపిస్తున్నది.

ఇక తాంత్రిక మంత్రములు రహస్యములు. ఇతరులు వినరాదు. కనుక మనస్సులోనే చేసుకోవాలి. పెదవులు కదిలిస్తూ చేసేది ఉపాంశు జపం. వీటిలో మానసికము శ్రేష్ఠమైనది.

**భావనపద్ధతి :** దేవతననే అద్వైతభావనతో ధ్యానము జపము చేయటం ఉత్తమపద్ధతి. దీనిని దివ్యభావన అంటారు. లలితా పూజాస్తోత్రంలో అహమిత్యేవ విభావయే భవానీం – నేనే పరమేశ్వరిని అనుకొనాలి అని చెప్పబడింది. శివోభూత్వా శివం యజేత్ శివుడై శివుని పూజించాలి; నా రుద్రోరుద్రమర్చతి రుద్రుడు కానివాడు రుద్రుని అర్చింపరాదు – ఈ వాక్యాలన్నీ ఆ భావనను తెలియచేసేవి –దేవత నా తల్లి, నా తండ్రి లేక సర్వేశ్వరి సర్వేశ్వరుడు – సర్వశక్తులు గల మూర్తి అనుకోవటం మామూలు పద్ధతి. దీనికి పశుభావన అని పేరు. పరమేశ్వరుని పురుషునిగా తనను ఆయన ప్రియురాలుగా భావించుకొనే దానిని మధురభక్తి అంటారు. అనంతచైతన్యము స్త్రీ కాదు, పురుషుడు కాదు. కావాలంటే ఏదైనా అవుతుంది. కాబట్టి పురుషుడు దేవతను తన ప్రియురాలుగా భావించి సాధన చేసే పద్ధతికి వీరభావన అని పేరు. వామాచార మార్గంలో దీనికి ప్రాధాన్యం ఎక్కువ.

**జపము :** ప్రతి మంత్రానికి పురశ్చరణ సంఖ్య వుంటుంది. పురః అంటే ముందు. చరణ అంటే చరించుట దేవతను తన ముందు చరించేలా చేసేది పురశ్చరణ. జపమాల సరిగా ఎన్నుకోవాలి. ఉదాహరణకు గణపతికి తులసిమాల పనికిరాదు. చంద్రునకు ముత్యాలమాల, సూర్యునకు స్ఫటికమాల, శివునకు రుద్రాక్షలు, లలితాది అరుణదేవతలకు పగడాలమాల, బగళకు పసుపుమాల, కాళీ, భైరవ, బేతాళాదులకు నీలిమాల – ఇలా దేవతరంగు, గుణము బట్టి ఎంపిక చేసుకోవాలి. కొన్నిసార్లు దేవత ఒకటే అయినా ధ్యేయాన్ని బట్టి మాల మారుతుంది. గాయత్రిని జ్ఞానం కోసం చేస్తే స్ఫటికమాల, వైరాగ్య శాంతులకైతే తులసి, ఐశ్వర్యానికి పగడాలు, మనశ్శాంతికి ముత్యాలు, శక్తులకోసం రుద్రాక్ష ఈ విధంగా తెలుసుకొని వాడాలి. జపము మరీ వేగంగా గాని మరీ నెమ్మదిగా కాని చేయరాదు. స్థిరంగా సమవేగంతో చేయాలి. జపమాలను కుడిచేతి ఉంగరపు వేలిపై ఉంచి బొటనవేలు మధ్య వేలితో తన వేపు పూసను లాక్కోవాలి. చూపుడు వేలు తగలరాదు. మధ్యలోని కొలికిపూసను మేరువు అంటారు. దానిని దాటరాదు అది రాగానే మాలను వెనుక్కు తిప్పుకోవాలి. హోమం

చేసేటప్పుడు ఆహుతులు కుడిచేత్తో వేయాలి గనుక అప్పుడు మాలను ఎడమ చేతితో ఉపయోగించవచ్చు. జపమాల – నేలను తగలరాదు. ఎప్పుడైనా చేతినుండి జారవచ్చు గనుక క్రింద ఒక గుడ్డ పరచుకొని ఉంచాలి. దానిపై పడినా మళ్ళీ తీసుకోవచ్చు.

**ధ్యానము :** సాధకులకు కొంత ఏకాగ్రస్థితి వచ్చినప్పుడు జపం ఆగిపోతుంది. మంత్రోచ్చారణ నిలచిపోతుంది. దేవతాభావన మాత్రం ఉంటుంది. అది చాలా మంచి స్థితి. ఆ స్థితిలో ఎంతసేపు వుండగలిగితే అంతసేపు వుండి మళ్లీ జపం చేస్తూ ఉండాలి. ఏకాగ్రస్థితిలో జపం యొక్క లెక్క అక్కరలేదు.

**హోమము :** సాధనలో హోమము అంత్యంత శక్తిమంతమైన దన్న విషయం చెప్పటం జరిగింది. అప్పటికప్పుడు ఇటుకలు పేర్చుకొని చేసే పద్ధతికి స్థండిలమని పేరు –కొలతల ప్రకారం మేఖలతో నిర్మిస్తే కుండమంటారు. చతురస్రము, త్రికోణము, యోని, వృత్తము, పద్మము. ఈ విధముగా కుండములు బహువిధములు. కుండానికి వెడల్పు, పొడుగు, లోతు, ఒకే కొలత ఉండాలి. మూడు మేఖలలు (మెట్లు) ఉండాలి. సత్వరజస్తమో గుణాలకు ప్రతీకలుగా వాటికి పైనుండి తెలుపు, ఎరుపు, నలుపు రంగులు వేయాలి. కుండములలో చతురస్ర కుండము అన్ని ప్రయోగజనాలకు పనికివస్తుంది. త్రికోణ కుండమును శత్రుసంహారానికి గ్రహబాధా నివారణకు, యోనికుండము వశీకరణానికి, పద్మకుండము సిరిసంపదలకు, వృత్తకుండము కావ్యజ్ఞాన సిద్ధులకు ఇలానే మిగతావి కూడా తెలుసుకొని ఉపయోగించాలి. అన్ని కుండములలో అడుగున మధ్య యోని ఆకృతిగల రేకుగాని, రాయిగాని ఉంచాలి. **యోనౌ యోనిం నకారయేత్** అన్న నిబంధన ననుసరించి యోనికుండములో యోని అక్కరలేదు.

కుండములో అగ్నిని ఆవాహనము చేసి తరువాత దేవతతో అగ్నిని ఏకము చేసి హోమము చేయాలి. మంత్రమునకు స్వాహా కలపి ఆహుతుల వేయాలి. ఈ ప్రక్రియ అంతా ప్రత్యేకంగా చెప్పబడింది. కనుక ఇక్కడ వివరించటం లేదు. ఆహుతులు వేసేప్పుడు ఏదైనా వస్తువు కొంత ఇవతల పడితే దానిని తిరిగి కుండములో వేయరాదు. బ్రహ్మవరం వల్ల అది వమ్రి అనే జీవికి చెందుతుందని దేవీభాగవతంలోని హయగ్రీవకథలో చెప్పబడింది.

ఇక ప్రయోజనాన్ని అనుసరించి హోమద్రవ్యాలు మారుతవి. శాంతికి ఆవునెయ్యి ప్రధానము. వశీకరణానికి నువ్వులు, బెల్లము, నువ్వులనూనె, జొన్నలు, జీలకర్ర,

ఎర్రని పూలు, ఇప్పపువ్వు మొదలగునవి. స్తంభనమునకు పసుపు, పసుపు పచ్చపూలు; ఉచ్చాటన మారణ దుష్టగ్రహ నివారణకు మిరియాలు, ఆవాలు, మిరపకాయలు ఉప్పు, ఆవునూనె, ఊడుగనూనె మొదలగునవి; రాజస తామస దేవతలకు కుంకుమ అద్దిన గుమ్మడికాయ ముక్కలు, బెల్లంతో వండిన గుమ్మడి ముక్కలు ఇష్టము. అన్ని రకాల పండ్ల ముక్కలు దేవతా ప్రీతికి ఉపయోగించవచ్చు. ప్రత్యంగిర, కాలభైరవుడు మొదలగు దేవతలకు వామాచారంలో మద్యముతో హోమము సర్వసిద్ధిప్రదము. (కేవలం మద్యహోమేన లభంతే సర్వసిద్ధయః) లేడి (జింకమాంసములు) వశీకరణానికి, దున్నపోతు మాంసము స్తంభనానికి, కాకి మాంసము ఉచ్చాటనకు, కోడి, గొర్రె మాంసములు అభీష్టసిద్ధికి ఉపయోగించవచ్చు.

**బలులు :** రాజస తామస దేవతలు బలుల వల్ల సంతోషించి వరము లిస్తవి. జంతు బలుల వల్ల మంత్రసిద్ధి వేగముగా రావచ్చు కాని చంపిన పాపం అనుభవించక తప్పదు. దక్షిణాచార మార్గంలో పిండంతో జంతువుబొమ్మ చేసి పిష్టపశుబలి యివ్వటం ఉన్నది. కూష్మాండబలి (గుమ్మడికాయబలి) జంతుబలితో సమానంగా చెప్పబడింది. కొబ్బరికాయ పీచు తీసి బలిగా ఇవ్వవచ్చు. కొందరు కొబ్బరికాయలు దూరంగా కొట్టించి తెప్పించి నైవేద్యం పెడతారు. దానివల్ల పండ్లు మొదలగు ఇతర వస్తువులతో సమానవుతుంది. అదే కొబ్బరికాయ మంత్రము చెప్పి దేవత ఎదురుగా కొట్టి నైవేద్యము పెడితే బలితో సమానం అవుతుంది. కొబ్బరికాయలోని జీవశక్తి దేవతకు చెందుతుంది. అలాగే కొందరు హోమంలో పచ్చి కొబ్బరికాయ తొందరగా ఆహుతి కాదు అని ఎండుకొబ్బరి కురిడి పూర్ణాహుతిలో ఉపయోగిస్తారు. దానివల్ల ప్రయోజనం లేదు. జీవశక్తి ఉండేది పచ్చి కొబ్బరికాయలో మాత్రమే. అలానే హోమంలోని పూర్ణాహుతిలో కొబ్బరికాయ లేక పోకకాయ లేక ఖర్జూరకాయ మాత్రమే ఉపయోగించాలి. ఎందుకంటే ఈమూడు కొమ్మలు లేని చెట్లు. వేసిన ఆహుతులు చేసిన హోమం ఏకంగా ఊర్ధ్వముఖంగా – ప్రక్కలకు పోకుండా పైకి వెళ్ళాలంటే వీటిలో ఒకటి వాడినప్పుడే అది సాధ్యమవుతుంది.

**పూజా విగ్రహములు**

బంగారు, వెండి, రాగి విగ్రహాలు పూజ కుపయోగించవచ్చు. ప్రతిష్ఠలకు శిలావిగ్రహాలు కావాలి. లోహ విగ్రహాలకు స్థిర ప్రతిష్ఠ చేసే ఆచారం లేదు. దారు విగ్రహాలకు కూడా పూజ చేయవచ్చు. తెల్లజిల్లేడు మొదలైన వేరులతో విగ్రహాలు చేసి ప్రత్యేక ప్రయోజనాలకు ఉపయోగిస్తారు. అయితే ఈ మూలికలను తీసే పద్ధతి ఉంది.

మూలికా గ్రహణవిధి విడిగా చెప్పబడింది. దాని ప్రకారం మూలికలు సేకరించాలి.

**యంత్రములు**

దేవతాశక్తిని ఆకర్షించే సాధనాలలో యంత్రం అత్యంత ప్రధానం. హోమంలో కూడా కుండం ఒక యంత్రమే. కుండంలో అగ్నియంత్రమును భావించి అగ్ని స్థాపన చేయాలి. దేవాలయాలలో కూడా యంత్రానిదే ప్రధానస్థానం. వివిధ దేవతలకు వివిధ యంత్రాలు తంత్ర గ్రంథాలలో చెప్పబడినవి. వాటిని లేఖనం చేసి ప్రాణప్రతిష్ఠ చేసి ఉపయోగించాలి. ఒకసారి విగ్రహానికి గాని, యంత్రానికి గాని ప్రాణ ప్రతిష్ఠ చేస్తే నిత్య పూజానైవేద్యములు తప్పనిసరి. ప్రాణప్రతిష్ఠామంత్రము వైదికమైనది, తంత్రోక్తమైనది ఉన్నవి. వాటిని పురశ్చరణ చేసి అధికారం పొంది ఉపయోగించాలి.

నైవేద్యం : నైవేద్యం ఎంత పెట్టాలి ? ఏమి పెట్టాలి ? అని చాలామంది అడుగుతుంటారు. దేవతలందరికి సహజంగా మధుర వస్తువు లిష్టము. కొందరికి కొన్ని ప్రత్యేకమైన ఇష్టాలుంటవి. వాటిని తెలుసుకొని పెట్టాలి. ఉదాహరణకు గణపతికి కుడుములు ఉండ్రాళ్ళు, కాలభైరవునికి గారెలు, రాధాకృష్ణులకు పాలతో చేసిన తీపి వస్తువులు ఇలా అభీష్టాలుంటవి. అన్నంతో భక్ష్యములతో మహానైవేద్యం అన్ని దేవతలకు పెట్టవచ్చు. పెద్ద ప్రయోజనాల కోసం చేసే యజ్ఞాలలో దేవతయెత్తు అన్నిరాసులు నివేదించాలి. ఒక మతాచార్యుని దేవతకు ఎంత నివేదన పెట్టాలి ? అని అడిగితే ఆయన "దేవత ఎలా కనపడాలని నీవు భావిస్తున్నావు ? నీ వలె నీ ఎదురుగా నిలబడాలని భావిస్తే నీ వెంత తింటావో అంత పెట్టు" అన్నాడు. తొందరలో ఉన్నవారు అవసరార్థం ఏ బెల్లంముక్కో పెట్టి దణ్ణం పెడుతుంటారు. తప్పని పరిస్థితులలోనే అది. దేవతలు మాకు నైవేద్యాలు పెట్టమని కోరరు. జపములతోనే సంతృప్తి పడతాడు. 'జపై స్తుష్యంతి దేవాశ్చ' అయితే పెట్టటం మొదలు పెడితే ఆ నైవేద్యాలకు అలవాటు పడి ఎదురు చూస్తుంటారు కనుక రోజూ పెట్టాలి.

యంత్రములను అన్నివిధాల ప్రయోగాలకు ఉపయోగిస్తారు. బంగారు, వెండి, రాగి, యంత్రాల పూజలకు ధారణకు వేపచెక్క మొదలగునవి ప్రయోగాలకు వాడుతారు. క్షుద్రప్రయోగాలకు ఇనుపరేకుపై యంత్రం వేసి దానిపై నూరిన ఆవపిండి, మిరియాల పొడి, మిరపకారం, తడిముద్దలు పెట్టి మంత్రం పఠిస్తూ నిప్పులపై కాల్చే పద్ధతి ఉపయోగిస్తారు. కొన్నింటిలో వేప లేక తెల్లజిల్లేడు లేక విభీతకము (తాని) మొదలగు వానితో దేవతావిగ్రహం చేసి కుండలో మద్యంపోసి ఈ విగ్రహం దానిలో ఉంచి నేలలో పూడ్చి దానిపై పీటవేసి దానిపైన శవముపై కప్పిన వస్త్రము పెట్టి యంత్రం

వేసి దానిపై నరకపాలం పెట్టి ప్రాణప్రతిష్ఠ చేసి పూజ చేసి బలి సమర్పించి జపం చేస్తే తీవ్రదేవతాసిద్ధి చాలావేగంగా కలుగుతుంది. వేపచెక్కవంటి వాటిపై యంత్రం వేసే ప్రక్రియలు కూడా ఉన్నవి. చెక్కలమీద, రేకులమీద యంత్రాలు వేయుటమే కాక తాత్కాలిక యంత్రాలు కొన్ని కుంకుమపువ్వుతో, నల్లమందుతో,మిరియాల పొడితో, పసుపు కుంకుమలతో గుణసంబంధమైన చూర్ణములతో యంత్రాలు వేసి కార్యసిద్ధి కుపయోగిస్తారు.

**విసర్జన :** హోమం చేసేవారు పూర్తి అయితే అగ్నికి, దేవతకు విసర్జన చెప్పాలి. ఇంట్లో యంత్రపూజ చేసేవారు ప్రతిష్ఠిత యంత్రంలో దేవత ఎప్పుడూ ఉంటుంది గనుక విసర్జన చెప్పరాదు. ఒక దేవతా హోమం తర్వాత అదే కుండంలో మరొక దేవతా హోమం చేయదలచుకొంటే మొదటి దేవతకు విసర్జన చెప్పి అగ్నికి మాత్రం ఉద్వాసన చెప్పకుండా రెండవ దేవతను ఆవాహనం చేయాలి. దానివల్ల కొంత సమయం, ప్రక్రియ కలిసివస్తుంది.

**తర్పణము :** పురశ్చరణలో తర్పణము ఒక భాగము. కొబ్బరి నీళ్ళతో లేక పాలతో మంత్రము, దేవత పేర ద్వితీయా విభక్తిలో చెప్పి తర్పయామినమః అంటూ యంత్రంపై లేక విగ్రహంపై లేక ప్రతీకపై తర్పణం విడవాలి. షట్ప్రయోగాలకు తర్పణం ఉపయోగించే పద్ధతి ఉంది. వశీకరణానికి కుంకుమ జలంతో, శాంతి స్తంభనాలకు పసుపు నీళ్ళతో, గ్రహబాధా రోగనివారణలకు మిరియాలు, ఆవాలు మొదలగు తీవ్ర ద్రవ్యాల కషాయాలతో, ఆరోగ్యానికి వేపకషాయంతో వస్తువు గుణాలను బట్టి వాడుకోవాలి.

**పూజ :** దేవతను బట్టి రంగు రంగుల పూలు, పసుపు, ఎరుపు, నలుపు, అక్షతలు, బియ్యము, యవలు, గోధుమలు, జొన్నలు పసుపుకుంకుమలతో కలిపి వాడవచ్చును. సాత్విక రాజసదేవతలకు సువాసనగల పూలు, తామస దేవతలకు వాసనలేని పూలు వాడటం ఆచారం. **'నభైరవం మల్లికాభిః'** భైరవుని మల్లెపూలతో పూజించరాదు వంటి శ్లోకాలు ఈ తత్వాన్ని తెలపటానికే వచ్చినవి. అష్టోత్తర సహస్రనామాల తోనే కాక దేవతలను మంత్రముతో పూజించటం మరింత గుణాస్పదము. మంత్రములో 'నమః' ఉంటే సరే ! లేకపోతే మంత్రం చివర నమః చేర్చుకొని పూజ చేస్తే దేవత సంతోషిస్తుంది. కుంకుమ పూజలు, అక్షతలతో పూలతో పూజలు ప్రసిద్ధములే. కాకుంటే మంత్రముతో పూజించటం ఎక్కువ మందికి తెలియదు.

**మార్జనము :** మంత్రము, ద్వితీయావిభక్తి చివరగల దేవతానామము, మార్జయామి నమః అని కలిపి పువ్వుతో దేవతావిగ్రహము లేక యంత్రముపై నీళ్ళు చల్లుట (మార్జనము అంటే తుడిచి శుభ్రము చేయుట మార్జని అంటే చీపిరి)

**అభిషేకము :** మార్జనము బదులు అభిషేకము కూడా చేయవచ్చును. దీనిలో **"అభిషించామి నమః"** అని కలిపి చేయాలి. లోకంలో అభిషేకం అనగానే నమకచమకాలతో చేయటమే అనుకొంటారు. సాధనలో ఇష్టదేవతను ఆ దేవతా మంత్రంతో అభిషేకం చేయాలి.

**సమారాధనము :** పురశ్చరణలో భాగంగా వేదవేత్తలకు సంతృప్తిగా భోజనం పెట్టాలి. దేవతలను బట్టి చిన్న మార్పులున్నాయి. అమ్మవారి సాధనలో స్త్రీలకు, ముత్తైదువులకు, కొన్నింటిలో కన్యలకు కొన్నింటిలో చిన్నపిల్లలకు పెడతారు. కుమారస్వామిని, వటుకభైరవుని పూజించే వారు వటువులకు, బ్రహ్మచారులకు భోజనం పెడతారు. యతులకు అనగా సన్యాసులకు భిక్షపెట్టడము సర్వసిద్ధిప్రదము. యజ్ఞములలో ఏ విచక్షణ లేకుండా అందరికి అన్న సంతర్పణ చేయాలి.

**మంత్రసిద్ధి అంటే ఏమిటి ?**

తన మంత్రము యొక్క అధిష్ఠాన దేవత సాక్షాత్కరించి కోరినకోర్కె వరంగా ఇవ్వటము పూర్ణసిద్ధి. ఒక మంత్రము యొక్క పురశ్చరణ శాస్త్రములో చెప్పబడిన రీతిలో పూర్తి చేస్తే మంత్రాధికారం వస్తుంది. పురశ్చరణ నియమాలు **1)** ఏక భుక్తము - ఒంటిపూట భోజనం చేయాలి. 2) భూశయనం - నేలపై చాపవేసుకొని పండుకోవాలి. 3) బ్రహ్మచర్యము – రతిక్రీడ, శృంగారభాషణలు కామ వ్యవహారములు పనికిరావు. 4) వీలైనంతవరకు గృహము లేక ఆశ్రమము దాటి బయటకు పోరాదు. కనీసము ఊరు దాటరాదు. 5) నఖకేశ ఖండనము – గోళ్ళు కత్తిరించుట, క్షవరము, చేయరాదు. గడ్డము గీయరాదు. 6) దీక్షాభంగకరమైన పనులేవీ తలపెట్టరాదు. ఇక జపము భోజనానంతరము మూడు గంటలు విడిచిపెట్టి ఎప్పుడైనా చేయవచ్చు. పగలు, రాత్రి అనే నిబంధన లేదు. భోజనము చేయక అల్పాహారము మాత్రమే తీసుకొనే వారికి సమయ నియమము లేదు. ఈ విధంగా దీక్ష చేసిన సాధకునకు మంత్రాధికారం వస్తుంది. శాంతి వశ్యాది ప్రయోజనాలు వేటికైనా జపహోమములు చేసి కార్యసిద్ధి సాధించవచ్చు.

మూడురాత్రులు ఉపవసించి జపం చేసి శయనిస్తే వచ్చే స్వప్నములను బట్టి దేవత అనుగ్రహిస్తుందా లేదా అనేది నిర్ణయించవచ్చు. కలలో దేవతలు వస్తే

శుభసూచన. మామూలు కలలుగాక దేవతలు రావటం అంటే వాళ్ళ సంకల్పం ఉంటేనే స్వప్న దర్శనం అవుతుంది. లేకపోతే కాదు. తెల్లనిపద్మము, ఏనుగు, శ్వేతాశ్వము తెల్లని గుర్రము, వెన్నెల, పూలతోట, పూలతో నిండిన సరస్సు, చంద్రుడు, సిద్ధయోగులు, సౌందర్యవతులైన స్త్రీలు శుభసూచనలు. వికృతమైన నల్లని ఆకారం కలవారు, చీకట్లో ఎవరో కొడుతున్నట్లు, నూనె ఒంటికి పూసుకొన్నట్లు, జుగుప్సా వహమైన దృశ్యములు అశుభసూచనలు. వీనినిబట్టి మంత్రజపం కొనసాగించాలా లేదా అనేది నిర్ణయించుకోవాలి.

ప్రాచీన కాలం నుండి మంత్రసిద్ధికి కఠోర నియమాలను పెట్టుకొని జపం చేయటం ప్రధానంగా వస్తున్నది. ఉపవాసాన్ని మించిన నియమం మరొకటి లేదు. భోజనం మాని పండ్లు, పాలు తీసుకుంటూ, వాటిని కూడా మాని నీరుమాత్రమే తీసుకుంటూ చివరకు అది కూడా మాని వాయుభక్షణ చేస్తూ ఎండాకాలం పంచాగ్నుల మధ్య శీతాకాలం గొంతులోతు చన్నీళ్ళలో నిలబడి తపస్సు చేసేవారు. ఇప్పు డంతటి ఉగ్రాచరణ కష్టం. శరీరం దెబ్బ తినకుండా వీలైనన్ని నియమాలతో చేయటం మంచిది. ధ్యానస్థితి లభించి విస్మృతి కలిగే పారవశ్య స్థితి వచ్చిన వానికి ఇవేవీ అక్కరలేదు.

వామచారంలో ఈ ఏకాగ్రతకు మద్యాన్ని భంగును గంజాయిని ఉపయోగిస్తారు. బెంగాల్‌లోని ప్రసిద్ధ కాళీసిద్ధుడు రామప్రసాద్ 12 సంవత్సరాలు మద్యపానం చేసి పంచకపాలాసనం మీద కూర్చుండి సాధన చేశాడుట. కాశీలోని దీర్ఘకాలజీవి కీనారాం అఘోరీ భంగుత్రాగి శ్మశానసాధనలు చేసి బెలూచిస్థాన్‌లోని హింగుళాకాళిని ప్రసన్నను చేసుకొని కాశీ తీసుకువచ్చాడు. అతని సమాధి ఆశ్రమము కాశీలో ఇప్పటికీ ఉన్నవి.

ఈవిధంగా తమకు వచ్చిన మార్గంలో సాధన చేసి దేవతానుగ్రహం పొందవచ్చు. ఆయా సాధనలు వాటి విశేషాలు వివిధములైన సమస్యలకు మంత్రప్రక్రియల ద్వారా పరిష్కారాలు ఈ గ్రంథములో ఇయ్యబడినవి. ఉత్సాహము, పట్టుదల గల సాధకుల వీనిని ఉపయోగించు కొందురు గాక!

**వామాచారములో మరికొన్ని విశేషాలు :**

ఈ మార్గంలో ప్రధానంగా ఉపయోగించేవి 1) మద్యము 2) మత్స్యము 3) మాంసము 4) మైథునము 5) ముద్ర. దీనిలో మత్స్యము లనగా చేపలు. జంతువులను చంపి చర్మము, ఎముకలు, గోళ్ళు తొలగించగా మిగిలిన భాగము మాంసము. మాంసముతో చేసిన తినుబండారములు ముద్రలు. రాజస తామస దేవతలకు వీటిని నైవేద్యం పెట్టెదరు. మద్యము వీటిలో ప్రధానమైనది. మాంసము నుపయోగించని

వారు కూడా కొందరము మద్యము వరకు నివేదిస్తారు. అది వృక్షజన్యమైనదని వారి సమర్ధన. తాటి, ఈత, ఇప్ప మొదలైన చెట్లనుండి తీయబడిన రసము కనుక శాకాహారులలో వామాచార సాధకులు దీనిని వాడుటకు ఇష్టపడుదురు. ఫలములు, భక్ష్యములు మొదలైన వాటితో పాటు మద్యమును నివేదించి దానిని ప్రసాదముగా స్వీకరించి జపము చేస్తుంటారు. ధ్యానంలో ఏకాగ్రత కోసం కొందరు ఎక్కువ మోతాదులో మద్యమును పుచ్చుకుంటారు. మద్యముతో హోమం చేస్తే సర్వసిద్ధులు లభిస్తాయని తంత్రగ్రంధములు చెపుతున్నాయి. **(కేవలం మద్యహోమే లభంతే సర్వసిద్ధయః)** మాంసములలో జంతువుల గుణాన్ని పట్టి ఏ దేవతకు, ఏ అవసరం కోసం దేనిని నివేదించాలో అది చేయాలి. ఉదాహరణకు, లేడి లేక జింకమాంసము వశీకరణకు మేక లేక గొర్రెమాంసము ఇష్టసిద్ధికి, వశీకరణమునకు, దున్నపోతు మాంసము స్తంభనకు, కోడిమాంసము సకల కామములకు, కాకిమాంసము, ఉచ్చాటనకు, ఇత్యాదిగా వినియోగించవలెను. ఆయా జంతువుల రక్తములను కూడా ఇదే విధముగా వాడవచ్చును. రక్తమును అన్నముతో కలిపి బలికి హోమమునకు ఉపయోగించవచ్చును. సాధకుడు తన శరీర రక్తమును దేవతకు సమర్పించిన సిద్ధి వేగముగా లభిస్తుంది. చండీసప్తశతిలోని నాల్గవకథలో సురధుడు, సమాధి అనే ఇద్దరు సాధకులు తమ శరీర రక్తమును కొంచెము కొంచెముగా ప్రతిరోజు సమర్పించి మూడు సంవత్సరములలో చండీదేవి వలన వరములు పొందినట్లు చెప్పబడినది. కొందరు సాధకులు ఏకాగ్రతకొరకు మద్యము బదులుగా భంగు లేక గంజాయి ఉపయోగిస్తారు. రెంటిలో మద్యము కంటే గంజాయి శ్రేష్ఠమని కొందరి అభిప్రాయము. **(సంవిదాసవయోర్మధ్యే సంవిదేవ గరీయసీ)** సంవిత్ అనగా జ్ఞానపత్రి లేక గంజాయి. దీని ఆకులు పొడిచేసి పాలలో కలిపి కాగపెట్టితే దానిని భంగు అంటారు. చిలుములో వేసి పొగగా పీలిస్తే గంజాయి అంటారు. వీనికి అనుపానంగా బలమైన మధుర పదార్థాలు తీసుకొనవలెను. లేనిచో శరీరము క్షీణించి పోతుంది. మద్యమునకు కేవలము ఏకాగ్రతను ఇచ్చే శక్తి మాత్రమే ఉన్నది. గంజాయికి త్వరగా దర్శనాలు ఇచ్చేశక్తి ఉన్నది. గంజాయి తాగినవారు ఊహా వైహాయస వీధులలో విహరిస్తూ తాను కోరిన వాటి నన్నింటిని చూచి అనుభవించుచున్నట్లు భ్రాంతి చెందుతుంటారు. ధ్యానసాధనలో ఈ వస్తువులను చాలా జాగ్రత్తగా ఉపయోగించి సరి అయిన మార్గంలో స్వప్న భూమికను దాటి పైకి వెళ్ళకలగాలి.

ఈ మార్గంలో మరొక ప్రధానమైన అంశము మైధునము. అనుకూలవతి అయిన స్త్రీని యవ్వనవతిని తెచ్చి దిగంబరను చేసి ఆమెలోకి దేవతను ఆవాహన చేయాలి.

షోడశోపచారములతో ఆమెను పూజించాలి. ప్రత్యేకముగా యోని పూజ చేయాలి. ఆమె కూడా ఉపాసకురాలయితే మేలుతరము. కాని పక్షములో తన మంత్రమును ఆమె చెవిలో చెప్పాలి. మంత్రమును ఉచ్చరిస్తూ సాధకుడు ఆమెతో రతిక్రియ చేయవలెను. రతిక్రియ తరువాత యోనియందు స్ఖలించిన వీర్యమును తీసి తెల్లజిల్లెడు పూలతో అద్ది దేవతా యంత్రమునకు, లేక విగ్రహమునకు మంత్రము చెప్తూ పూజ చేయాలి. కర్పూరాది స్తోత్రములలోను కొన్ని తంత్రములలోనూ శ్మశానములో రాత్రిపూట ఏకాంతముగా చితాభస్మమునందు కాళీయంత్రమును ఉంచి హస్తరతి చేసుకుని స్ఖలించిన వీర్యముతో వేయి తెల్లజిల్లెడు పూలను దానిలో అద్ది కాళీమంత్రముతో పూజ చేస్తే శీఘ్రముగా మహారాజు కాగలడని చెప్పబడిఉన్నది. మరియొక ప్రక్రియలో స్త్రీతో రతి అనంతరము స్ఖలించిన వీర్యమును పాత్రలోని పాలలో కలిపి దేవతకు నివేదించి ప్రసాదముగా స్వీకరించవలెనని ఉన్నది. రతిక్రియకు ముందు మద్యనివేదన, రతి అనంతరము వీర్యనివేదన, రతివేళ మంత్రజపము ఇందులో ప్రధానమయిన అంశములు.

తీవ్రసాధకురాలైన స్త్రీ తనకు ఇష్టడయిన పురుషుని ఎన్నుకుని తాను దిగంబర అయి అతనిని దిగంబరుని చేసి అతడి యందు భైరవుని ఆవాహన చేయవలెను. యథావిధిగా పూజించి అతడి మర్మావయవము నందు ప్రత్యేకపూజలు చేసి హారతి పట్టి తరువాత మంత్రజపము చేస్తూ అతనితో రతిక్రీడను చేయవలెను. మిగిలిన ప్రక్రియ అంతా స్త్రీ, పురుషులిద్దరికీ సమానము. కాళీ, తార, మాతంగి, భైరవుడు మొదలైన దేవతలు ఈ మార్గమున త్వరగా సిద్ధిని ప్రసాదించెదరు.

**దక్షిణాచారము :**

ఈమార్గంలో వామాచారములోని ఏ ప్రక్రియ కూడా పనికిరాదు. ఏ వస్తువును కూడా ఉపయోగించరాదు. వామాచారములో జంతుబలులకు ప్రాధాన్యమున్నది. ఈ పద్ధతిలో పిండితో జంతువుల బొమ్మలు చేసి పిష్టపశువులను బలి ఇవ్వడం ఆచారముగా స్వీకరించబడినది. కొబ్బరికాయ పీచు పూర్తిగా తీసి ఎర్రకుంకుమ కాని నల్లకుంకుమ కాని పూసి బలిగా సమర్పించవచ్చు. అలానే కూష్మాండ బలి అనగా గుమ్మడికాయను బలి ఇవ్వడం జంతు బలితో సమానము (దీని ప్రక్రియ వేరే ఇవ్వబడింది) దక్షిణ దేశంలో కొంత మంది గుమ్మడికాయలో చిన్న ముక్క కోసి లోపల ఎర్రటి వసంతం పోసి మళ్ళీ ఆ ముక్క పెట్టి అప్పుడు దేవత ముందు కత్తితో నరుకుతారు. నరకగానే ఎర్రటి నెత్తురులాగా కన్పిస్తూ ప్రజలకు ఆకర్షణగా కన్పిస్తుంది. కానీ అది తప్పు ఎప్పుడయితే చిన్నముక్కను కోసి తీసారో జీవశక్తి పోతుంది. వామాచారంలో కూడ గాయపడిన జంతువును బలి ఇవ్వరు. ఆరోగ్యకరమైన జంతువుయొక్క రక్తము

మొదటిసారి దేవత కండ్లముందు మాత్రమే పడాలి. అలానే గుమ్మడికాయను కూడా మంత్రము స్మరిస్తూ దేవతముందు ఖండించాలి. రెండు ముక్కలు కాగానే వానిపై కుంకుమా, నీరు చల్లి దేవతకు బలిగా సమర్పించాలి.

ఇక దక్షిణాచార మార్గంలో దేవతకు ఇష్టమైన పాలు, పండ్లు, భక్ష్యముల నివేదన చేయాలి. ఎంత నివేదన పెట్టాలి ? అన్న అంశముకూడా తంత్రంగ్రంథములో, పండితులలో చర్చ జరిగింది. చాలామంది ఒక పండు, బెల్లంముక్క నైవేద్యం పెట్టి పూజ ముగిస్తుంటారు. ఒక మతాచార్యుడు ఈ విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ సమాధానం చెప్పినపుడు "దేవత తనంత ఆకారముతో కన్పిస్తే కాని మానవునికి సంతృప్తి ఉండదు. కాబట్టి తాను తినేటంత అన్నం నైవేద్యం పెట్టాలి" అన్నాడు. దేవాలయాలలో వందలు, వేలు జనముల కోర్కెలు తీర్చాలి. కనుక చాలా ఎక్కువ నైవేద్యములు పెట్టాలి. పెద్ద ఉత్సవాలలో దేవత యొక్క కంటి ఎత్తుదాకా అన్నరాశిని పోసి అధికసంఖ్యలో కొబ్బరికాయలు కొట్టి సమర్పిస్తారు. దానివల్ల ఆ దేవత బాగా సంతోషించి కార్యసిద్ధి వేగంగా ప్రసాదిస్తుంది.

ఈ పద్ధతిలో శౌచమునకు అత్యంతముఖ్యమైన స్థానమున్నది. సాధకుడు, సాధనకు కూర్చునేటపుడు స్నానం చేసి ఉతికిన లేక పట్టువస్త్రములు ధరించి కూర్చోవాలి. ఇతరులను తాకరాదు. ప్రతివ్యక్తిలోను వివిధములయిన గుణములుంటివి. ఒక మనిషి చుట్టూ సత్వ, రజసస్తమో గుణములకు చిహ్నాములయిన తేజఃపుంజములు వలయాకారముగా ఆవరించి ఉంటాయి. ఆ వ్యక్తికి గాని అతడు స్పర్శించిన వస్తువులను కాని తాకితే ఆ గుణములు సాధకుని మీద ప్రభావాన్ని చూపిస్తాయి. పరీక్షిన్మహారాజు జరాసంధుని కిరీటాన్ని ధరించి వేటకు వెళ్ళడం వలన అతడి దుర్గుణ స్పర్శ ఈతనికి కల్గి కోపము వచ్చి శమీకమహర్షి మెడలో పామును వేశాడు. ఇటువంటివి పురాణ వాఙ్మయములో గ్రహించి జాగ్రత్తలు తీసుకోవాలి. అశుచిత్వ స్పర్శవల్ల సాధనలో ఆటంకములు వస్తాయి. మంత్రసిద్ధి ఆలస్యం అవుతుంది. తాకడమే కాదు. వీలయినంతవరకు సాధన ఏకాంత ప్రదేశంలో చేయాలి. తన చుట్టూ ఉన్న మనుష్యుల భావతరంగములు తానుచ్చరిస్తున్న మంత్రశబ్ద తరంగాలను దేవతా కేంద్రానికి చేరకుండా అడ్డుపడడం వల్ల సిద్ధిసాధనలో వేగం తగ్గుతుంది. అందుకే ఏకాంత ప్రదేశం మాత్రమే కాక సమయం కూడా జనుల ఆలోచనతరంగాలు ఎక్కువగా ఉండని తెల్లవారుజామున లేక అర్ధరాత్రి సమయాన్ని ఉపయోగించుకోవాలి. ఇటువంటి జాగ్రత్తలనెన్నింటినో తీసుకుంటూ సాధన కొనసాగించాలి. ఇటువంటి నియమాలలో ఉపవాసం చాలా ముఖ్యమైనది. వీలయినంత సాత్విక ఆహారాన్ని తీసుకుంటూ అవకాశం ఉన్నప్పుడల్లా

ఉపవాసం ఉండాలి. ఆహారం తీసుకునేది- శక్తికోసం; శక్తి రజోగుణం నుంచే పుడుతుంది. సాత్వికఆహారమైనా రాజసంగా మారితేనే శక్తి వచ్చేది. తమోగుణయుతమైన ఆహారాన్ని తీసుకుంటే మరీ ప్రమాదము. ఉపవాసంలో ఉన్న వ్యక్తియొక్క శరీరము నాడీమండలము, మనస్సు దేవతా చైతన్యాన్ని వేగముగా స్వీకరించగలవు. అందుకనే పూర్వులు ఉపవాసాన్ని మించిన కఠోర నియమం ఏదీ లేదని ఉద్ఘాటించారు.

ఈ విధంగా మంత్రశాస్త్రంలో వివిధ సమస్యలకు పరిష్కారములు సూచించబడినవి. అయితే కొందరు పురాకృత కర్మ అవశ్యము అనుభవించి తీరవలసినదేనని దానిని ఏ మంత్రము వల్లకాని యజ్ఞం వల్లకాని తప్పించలేమని అంటారు. **(అవశ్యం అనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్)** అక్కడక్కడ దేవతా పూజల వల్ల బాధలు తగ్గుతున్నది కదా అనుకున్నప్పుడు "కర్మ విమోచనం అయ్యే సమయం వచ్చినపుడు పూజలు మంత్రములు, యజ్ఞములు చేయాలని చేయించుకోవాలని బుద్ధిపుడుతుంది. ఇది కూడా కర్మలో ఒక భాగమే. పూర్వకర్మవల్లనే ఆతడు పూజలు చేసుకుని లేక చేయించుకోవడం వల్ల బాధలు పోతాయి" అని వాదిస్తారు. ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తే మానవులకు పురుషకారం లేదని అనవలసి వస్తుంది. ఏ శాస్త్రమయితే పూర్వజన్మకర్మ అనుభవించక తప్పదని చెప్పుతున్నదో అదే శాస్త్రము దేవతా సాధనల వలన ఆయా బాధలను పోగొట్టుకోవచ్చని చెప్పుతున్నపుడు దానిని అంగీకరించక పోవడంలో ఔచిత్యం లేదు. ఏ దేవాలయానికి వెళ్ళినా అర్చన అయిన తరువాత తీర్థం ఇస్తూ ఈ శ్లోకం చదువుతారు.

**శ్లో॥ "అకాలమృత్యు హరణం సర్వవ్యాధినివారణం**
**సర్వపాపప్రశమనం దేవీ పాదోదకం శుభం.**

దేవి లేక దేవుని యొక్క పాదోదకం అకాలమృత్యువును తప్పిస్తుంది. అన్ని రోగములను పోగొట్టుతుంది. అన్ని పాపములను శాంతింపచేస్తుంది. అంటే కొత్త శక్తిని ప్రసాదించి బాధలను పొగొడుతుంది. మంత్రసాధనలూ అట్టివే. అవి లేని యోగాన్ని పుట్టించ కలవు. యజ్ఞం చేస్తే అపూర్వం ఉదయిస్తుందని, పూర్వమీమాంస చెబుతుంది. ఉదాహరణకు ఒక వ్యక్తికి సంతాన యోగం లేదనుకోండి. అతడు పుత్రకామేష్టి చేస్తే లేని యోగం పుట్టి సంతానం కలుగుతుంది. అలానే మిగతా ఫలితాలు కూడా.

అయితే ఇప్పుడు ఒక సందేహం కలుగుతుంది. మరి అనుభవించవలసిన కర్మ ఏమవుతుందని దానికి పురాణాలలో చెప్పబడ్డ సమాధానం చూడండి.

**శ్లో॥ ఇహైవ ఫలదం కర్మ ప్రారబ్ధం ప్రతిబధ్యచ**
**ఫలం దదాతు స్వప్నేన జాగ్రత్ కాలాంతరేపివా॥**

మంత్రరూపము, యజ్ఞరూపమయిన కర్మ ఈ జన్మలోనే ఫలిస్తుంది. మామూలుగా దాన ధర్మాలవల్ల వచ్చే పుణ్యం వచ్చే జన్మలో మాత్రమే ఫలిస్తుంది. అలాకాక మంత్రశక్తి పాతకర్మను పక్కకు నెట్టి వేసి కోరిన ఫలితాన్ని ఇస్తుంది. ఆగిపోయిన ఈ కర్మను మానవుడు కలలో గాని కాలాంతరమున గాని అనుభవిస్తాడు. ఒక్కొక్కసారి ఆ జన్మలో అనుభవంలోకి రాక మరుజన్మలోకి నెట్టి వేయపడవచ్చు చూడండి.

**శ్లో॥ ప్రారబ్ధ శేష విచ్ఛిన్నం పునర్దేహాంతరేణతు**
**భుంక్తే దేహి ననో భుంక్తే తల్లంఘయతి కఃపుమాన్ ॥**

కర్మను తప్పించుకొనుటకు ఎవరికి సాధ్యమవుతుంది ? వచ్చే జన్మలోనయినా అనుభవించక తప్పదు.

ఇటువంటివన్నీ జాగ్రత్తగా పరిశీలించి సాధకులు తమకు నచ్చిన మార్గంలో సాధన చేసి దేవతానుగ్రహం పొంది బాధలను పోగొట్టుకోవచ్చును. అభీష్టములు సాధించుకోవచ్చును. ఆయా సాధనలు, వాటి విశేషాలు వివిధములయిన సమస్యలకు మంత్ర ప్రక్రియల ద్వారా పరిష్కారాలు ఈ గ్రంథములో ఈయబడినవి. మంత్రశాస్త్రము అనంతమయినది గనుక యిందులో కొన్ని పద్ధతులు వివిధ సంప్రదాయములలో ఉన్నవి. మంత్రములు సంస్కృతములోనే కాక అన్ని భాషలలోనూ ఉన్నవి. ఆ వాఙ్మయము కాల గర్భంలో కలసి పోకూడదన్న ఉద్దేశ్యముతో ఈ గ్రంథరచనా ప్రణాళికలో అవసరం లేకపోయినా కొన్ని విద్యలను ఇవ్వడం జరిగింది. వాటిని ఆ దృష్టితో పరిశీలించాలి. ఉత్సాహం పట్టుదల గల సాధకులు తమ కవసరమైన ఇష్టమైన సాధనలను చేసి దేవతానుగ్రహమును అభీష్టసిద్ధిని పొందుదురుగాక !

**సూచన :** సాధకులు ఏది ప్రారంభించినా సంకల్పము చెప్పుకోవాలి. సంస్కృతంలో గాని తమ భాషలో గాని ఈ ప్రయోజనం కోసం ఈ దేవతామంత్రం జపం లేక హోమం లేక తర్పణం లేక మార్జనం చేస్తున్నాను అని మనస్సులో అనుకొని మొదలు పెట్టాలి. చివర ఇచ్చిన హోమవిధానంలో ఉన్న దానిని చదివి ఆ ప్రకారం దేనికైనా చేయవచ్చు. సాధన ఆ పూట పూర్తి చేసిన పిదప చేతిలో నీళ్ళు పోసుకొని పళ్ళెంలో – నేను చేసిన ఈ సాధన ఫలితాన్ని ఈ ప్రయోజనం కోసం దేవతకు సమర్పిస్తున్నాను అని వదలాలి. ఆ నీళ్ళలో కొంతభాగం తీర్థంగా స్వీకరించి మిగతాది ఏ చెట్టు మొదట్లోనో పోయాలి. ఇతరుల కోసం చేసేప్పుడు ఆ తీర్థం వారికివ్వాలి. దూరంగా ఉన్నవారికోసం చేస్తే జపము తర్వాత కుంకుమను దేవతకు సమర్పించి దానిని ఉద్దేశించబడిన వారికి చేర్చాలి. మంత్ర సాధన ఫలితాన్ని తన కోసం చేసుకోవచ్చు ఇతరుల కోసం చేసి ఫలితాన్ని వారికి ధారపోయవచ్చు.

## 2. గురుమంత్రములు

**శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదం**
**మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోఃకృపా.**

గురువుయొక్క మూర్తి ధ్యానమునకు మూలము; గురువుయొక్క పాదము పూజకు మూలము; గురువు యొక్క వాక్యము మంత్రమునకు మూలము; గురువు యొక్క దయ మోక్షమునకు మూలము.

**శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మైశ్రీ గురవే నమః.**

గురువు బ్రహ్మ, గురువు, విష్ణువు, గురువు, శివుడు, గురువే సాక్షాత్తు పరబ్రహము. అట్టి గురువునకు నమస్కారము.

**శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః**

కదిలేది కదలనిది అఖండముగా గుండ్రని ఆకారము కలది అయిన ఈ ప్రకృతి, లోకము ఎవనిచే వ్యాపించి యున్నదో దాని మూలస్థానము ఎవనిచే చూడబడినదో అట్టి గురువునకు నమస్కారము.

**గురు మంత్రములు**

1. ఓం హ్రీం గురో ప్రసీద హ్రీం ఓం
2. ఓం హ్రీం సిద్ధగురో ప్రసీద హ్రీం ఓం
3. ఓం హ్రీం పరమ గురో ప్రసీద హ్రీం ఓం
4. ఓం హ్రీం నమో గురో ప్రసీద హ్రీం ఓం
5. హంస శ్శివ స్సోహం
6. సోహం

## 3. విఘ్న నివారణ - కార్యసిద్ధి

మానవులు తలపెట్టిన పనులకు ఎన్నో విఘ్నములు కలుగుతుంటవి. ఆ ఆటంకాలను తొలగించటానికి దేవతలను ఆశ్రయించాలి. ఏదేవతైనా పనిచేసిపెట్టగలదు. అయినా లోకాచారంలోనూ, మంత్రగ్రంధములలోను వివిధ కార్యములకు వివిధ దేవతాసాధనలు చెప్పబడినవి. జనులు వారి వారి ఇష్టాలను బట్టి మంత్రసాధనలను చేసి తమ పనులు విజయవంతము చేసుకోవచ్చు.

**గణపతి సాధనలు**

సామాన్యంగా విఘ్నములకు అధీశ్వరుడైన గణపతిని పూజించి ఇబ్బందులను పోగొట్టుకొని, పనులను సాధించుకోవచ్చును.

1. గణపతి నామములు

సుముఖ శ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః
వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబ స్స్కందపూర్వజః

ఈ నామములను 21 సార్లు జపించి తరువాత క్రింది ఫలశ్రుతి ఒకసారి పఠించాలి.

షోడశైతాని నామాని యః పఠేత్ శ్రుణుయా దపి
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే.

2. మహాగణపతి

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వర వరద సర్వజనంమే వశమానయ స్వాహా

పురశ్చరణ లక్షజపం. కుడుములు ఉండ్రాళ్ళు నైవేద్యం– దశాంశ హోమము నువ్వులు, బెల్లం, ఎండు కొబ్బరి, నువ్వులనూనె, ఎర్రటిపూలు, కుంకుమఅద్దిన పండ్లముక్కలు, కుడుములు ఉండ్రాళ్ళు మొ॥ హోమద్రవ్యములు.

3. విజయ గణపతి

ఓం హ్రీం శ్రీం గ్లౌం గం వరవరదాయ విజయగణపతయే నమః

సాధన పై వలెనే

4. చింతామణి గణపతి

గం హ్రీం గం

సాధన పై వలెనే

5. వక్రతుండాయ హుం (వక్రతుండ గణపతి)

సాధన పై వలెనే

6. దుర్గ అధిదేవతగా గల మరియొక మంత్రము

ఓం హ్రీం దుం దుర్గే విఘ్నవినాశిని స్వాహా.

పురశ్చరణ లక్ష జపము – ఎర్రటి మధుర పదార్థము నైవేద్యము

# 4. వివాహ సిద్ధి

**గణపతి మంత్రము**

**ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం హరిద్రాగణపతయే**
**వరవరద (అముకస్య) శీఘ్రం వివాహం కారయ**
కారయ గ్లౌం గం ఫట్ స్వాహా.

పసుపుతో ముద్ద శివలింగము వలె చేసి కుంకుమ బొట్టు పెట్టి గణపతి పూజచేసి ఈ మంత్రము లక్ష జపంచేసి పదివేలు హోమం చేయవలెను. స్త్రీలు, పురుషులు ఎవరైనా దీనిని చేయవచ్చును. అముక అన్న చోట పెండ్లికావలసినవారి పేరు చెప్పవలెను.

**ఆడ పిల్లలకు లలితా మంత్రము**

**ఓం ఐం హ్రీం శ్రీం కామేశబద్ధ మాంగల్య సూత్రశోభిత కంధరాయై నమః**

108 పసుపు కొమ్ములతో లక్షజపం. జపం చేసిన పసుపు కొమ్ములను అమ్మవారి గుడిలో సమర్పించ వలెను. పదివేలు హోమం.

**ఆడపిల్లలకు కాళీ మంత్రము**

**కాత్యాయని మహామాయే! మహాయోగి న్యధీశ్వరి!**
**యోగ్యం వరం మహాకాళి! పతిం మే కురు తే నమః**

108 పసుపుకొమ్ములతో లక్షజపం. పదివేలు హోమం. జపం చేసిన పసుపు కొమ్ములను అమ్మవారి గుడిలో సమర్పించవలెను. పూజకు ఎర్రని పూలు, పచ్చని లేక ఎర్రని వస్తువు నైవేద్యము. పులిహోర, లడ్డు, మైసూరుపాకు మొ॥ దానిమ్మ మొ॥ పండ్లు. జాంగ్రి మొ॥ స్వీట్లు

**మగ పిల్లలకు చండీమంత్రము**

**పత్నీం మనోరమాం దేహి మనోవృత్తానుసారిణీం**
**తారిణీం దుర్గ సంసార సాగరస్య కులోద్భవాం.**

సాధన పై వలెనే

**మగపిల్లలకు గంధర్వ మంత్రము**

**ఓం క్లీం నమో భగవతే గంధర్వరాజాయ విశ్వావసవే**
**మమ అభిలషితాం కన్యాం ప్రయచ్ఛ స్వాహా.**

సాధన పై వలనే

**స్త్రీ పురుషులకు శివ మంత్రములు**

**1. ఓం గ్లౌం గం ఓం గౌరీపతయే నమః**

**2. ఓం ఐం హ్రీం శివ గౌరి భవ హ్రీం ఐం ఓం**

ఈ రెండు శివరాత్రినాడు చేసిన శీఘ్రముగా ఫలించును.

**వివాహ సాధనలకు హోమ ద్రవ్యములు**

1.పసుపుకొమ్ములు లేక పసుపు , 2. జీలకర్ర 3. బెల్లం, 4. పేలాలు.

**మాల :** ద్రాక్ష లేక ఎర్రచందనం మాల.

**యంత్రము :** త్రికోణము లేక యోని లేక షట్కోణము పళ్ళెములో అష్టగంధముతో వేసి పెండ్లి కావలసిన వారి ఫోటో దాని ముందుంచి పూజచేసి జపము చేసిన యెడల శీఘ్రసిద్ధి కలుగును.

రావి వేపచెట్లు కలిసిన చోట వానికి పూజచేసి జపించిన వేగసిద్ధి కలుగును.

**ప్రేమ వివాహ సిద్ధికి (స్త్రీ పురుషులకు)**

**శివమంత్రము- ఓం హ్రీం గ్లౌం అముకం సమ్మోహయ సమ్మోహయ ఫట్**

అముక అన్నచోట తాను ప్రేమించిన వ్యక్తిపేరు చెప్పవలెను. మహాశివరాత్రి నాడు లేక మాసశివరాత్రి ప్రారంభించి లక్ష జపముచేసి పదవవంతు నువ్వులు, నువ్వులనూనె, ఎర్రనిపూలు, ఎర్రని అక్షతలు వీటితో హోమం చేయవలెను. హోమభస్మము కొంత రావి చెట్టుపై చల్లి, కొంత ప్రవహించే నీటిలో కలపవలెను.

**గంధర్వమంత్రము - (పురుషులకు)**

ముందు చెప్పబడిన విశ్వావసుమంత్రము చేయవలెను.

**అప్సరో మంత్రము (పురుషులకు)**

**ఓం ఐం హ్రీం శ్రీం ఊర్వశి గగనమార్గే ఆగచ్ఛ మమ ఈప్సితం కురుకురు స్వాహా**

పూర్ణిమరాత్రి వెయ్యిజపం చేయవలెను. ప్రేమ సిద్ధికి లక్షజపం చేసి ఎర్రని పూలతో హోమం చేయవలెను.

దీనిని ఆరోగ్యము కొరకు కూడా చేయవచ్చును.

**మన్మథ మంత్రము (స్త్రీ పురుషులకు)**

కామాయ క్లీం కామిన్యై క్లీం జపము లక్ష. నువ్వులనూనెతో హోమం.

**మాతంగీ సాధన**

**ఓం క్లీం హూం మాతంగ్యై మనోవాంఛితసిద్ధయే ఫట్**

లక్షజపం. ఇప్పపువ్వుతో పదివేలు హోమం. ఇది ఇతర కామనలు తీరటానికి కూడా ఉపయోగించవచ్చు.

**5. సంతానసిద్ధి - సంతానగోపాల మంత్రము**

దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే

దేహిమే తనయం కృష్ణ త్వా మహం శరణం గతః

శ్రీకృష్ణుని చిత్రము గాని విగ్రహముగాని పెట్టుకొని పాలు మొదలైన మధురపదార్థములు నివేదనచేసి 108 తామరగింజలతో జపము చేయవలెను. (లక్ష). ఆవు నేతితో, మధుర పదార్థములతో పదివేలు హోమము చేయవలెను.

**సంతానకాళి**

**ఓం హ్రాం హ్రీం హూం కాళి పుత్రందేహి స్వాహా**

ఈ మంత్రము మామిడిచెట్టుక్రింద కూర్చొని 108 తామరగింజలతో లక్ష జపము చేయవలెను. అది సాధ్యముగానిచో జపము కాళీచిత్రము ముందు చేసి మామిడిపండుగాని రసముగాని తాంద్రకాని నివేదన పెట్టి తరువాత మామిడిచెట్టును తాకి జపమును సమర్పించవలెను. తామరగింజలతో మామిడిపండుముక్కలతో మధురవస్తువులతో, మారేడు దళములతో, మామిడి ఆకులతో పదివేలు హోమము చేయవలెను.

**సంతానగణపతి**

**ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే పుత్రవరదాయ నమః**

తెల్లజిల్లేడుతో చేసిన గణపతి విగ్రహమునకు, మారేడుదళములు, జిల్లేడు పూలతో పూజచేసి, ఎండుకొబ్బరి, బెల్లము, కుడుములు, ఉండ్రాళ్ళు నైవేద్యము పెట్టి రుద్రాక్ష లేక రక్తచందనము లేక తామరగింజల మాలతో లక్షజపము చేసి నైవేద్యమునకు- పూజకు చెప్పిన వస్తువులతో హోమము 10,000 చేయవలెను.

**సంతాన రేణుక : వివిధ దేవతలు - 39 నెం॥**

**5ఎ. గర్భస్రావ నివారణకు**

1) క్రీం హ్రీం హూం భద్రకాళి మహాకాళి రక్తచాముండే ఠఠఠఠ కిలికిలి ఫట్ స్వాహా.

**2) ఓం శ్రీం హ్రీం క్రోం ఐం రక్తపంచమి రేణుకే స్వాహా**

3) ఐం నమ ఉచ్ఛిష్టచాండాలి మాతంగి సర్వవశంకరి స్వాహా

4) హ్లీం బగళాముఖి స్వాహా

ఈ మంత్రములలో ఒక దానికి పదివేలు జపము చేసి తీర్థము గాని కుంకుమగాని ఈయవలెను.

**6. పురుషులకు యౌవనశక్తికి (చూడుడు -7నెం. వివిధ దేవతా మంత్రములు)**

ఓం క్లీం నమః పుష్పధన్వాయ యౌవనం దేహి క్లీం ఓం

లక్ష జపము నువ్వులు నూనెతో ఎర్రని పూలతో పదివేలు హోమము.

**7. పురుషులకు శీఘ్రస్ఖలన నివారణకు**

పూర్ణిమనాడు విశాఖా నక్షత్రము వచ్చినప్పుడు ఈ క్రింది మంత్రమును 108 సార్లు చేయవలెను.

**ఓం ఈం లీం భీం రం వం వామలోచనే వీర్యం స్తంభయ స్తంభయ నాదేమా కురుస్వాహా**

మామూలు రోజులలో అయినచో లక్షజపము చేయవలెను. దశాంశ హోమము పసుపుతో, పచ్చనిపూలతో, పసుపు,నూనె కలిపిన అక్షతలతో చేయవలెను.

కుపితాక్ష వినాయకునకు, ఆయన శక్తియైన బాలాదేవికి నమస్కరించి బాలాదేవి చేటికయైన ఈ వామలోచనా యక్షిణీ మంత్రము జపించవలెను.

**8) పిల్లలు చెప్పినమాట అసలు వినక చెడుమార్గము పట్టినచో మార్చటానికి**

**ఓం హ్రీం జ్వాలామాలిని పుత్రం (పుత్రీం) వశయ ఆకర్షయ హ్రీం ఓం నమః**

అమ్మవారి పటము ముందు కుమారుడు లేక కుమార్తె ఫొటో ఉంచి దానిపై కుంకుమచల్లి ఈ మంత్రము పదివేలసార్లు జపం చేయవలెను. మంత్రములో మగపిల్లవానికి పుత్రం అని, ఆడపిల్లకు పుత్రీం అని చెప్పవలెను.

**9. భార్యాభర్తల పరస్పర ఆకర్షణకు**

1) భార్యాభర్తలకు ఒకరిమీద మరొకరికి ధ్యాస లేక మనస్సులో వ్యతిరేకత కలిగితే భర్తకోసం భార్యగాని భార్యకోసం భర్తగాని ఈ మంత్రం భోజనం చేస్తూ జపం చేసి చివరిముద్ద మంత్రంచెపుతూ విస్తరిలో లేక కంచెములో వదిలివేయాలి.

**ఉచ్ఛిష్ట చాండాలిని సుముఖిదేవి మహాపిశాచిని హ్రీం ఠః ఠః ఠః**

విడిగా ఈ మంత్రాన్ని లక్ష జపం చేసి పదివేలు చెరుకుముక్కలతో, బెల్లముతో, ఇప్పపూలతో హోమము చేస్తే వేగముగా కార్యసిద్ధి కలుగుతుంది. ఈ మంత్రము ఇతర కార్యములకు కూడ పనిచేస్తుంది.

**2) ఓం కాళి కామమాలిని (పతిం) మే వశయ ఠః ఠః**

దేవి చిత్రమునకు ఎర్రనిపూలతో పూజచేసి ఈ మంత్రము లక్ష జపించి పదివేలు హోమము నువ్వులనూనెతో, ఎర్రని పూలతో, కుంకుమ కలిపిన అక్షతలతో చేయవలెను. భార్యకోసం సతీం అని భర్తకోసం పతిం అని మంత్రములో చెప్పవలెను.

**10. దురభ్యాసాలు పోవటానికి**

ఓం కాళికే ఫ్రేం ఫ్రేం హూంఫట్ స్వాహా క్రీం హ్రీం హూం

దీపావళినాడు గాని లేక ఏ అమావాస్యనాడైనా మొదలు పెట్టి రోజు 2100 చొప్పున 21రోజులు మంత్రం జపం చేసి ప్రతిరోజు తీర్థం ఇవ్వాలి లేదా కుంకుమ ధరింపచేయాలి.

**11. నిరుత్సాహం బద్ధకం పోవటానికి : చేతనా మంత్రములు**

**1) ఓం క్రీం హ్రీం హ్రూం కాళికే మమ మనశ్చైతన్యం కురుకురు హూం హ్రీం క్రీం ఓం స్వాహా**

మాసశివరాత్రినాడు గాని, అమావాస్యనాడు గాని మొదలు పెట్టి ఏడురోజులు రోజుకు మూడువేల జపం చేయవలెను.

**2) ఓం హ్రీం మమ జీవదేహ రోమ ప్రతిరోమ చైతన్యం జాగ్రయ హ్రీం ఓం నమః**

ఇష్టదేవతను హ్రీంకార రూపిణిగా భావించి పదివేలు జపము చేయవలెను. మొదట హ్రీంకారము ప్రక్కన ఇష్టదేవతపేరు చేర్చు కొనవచ్చును. దీనివలన శరీరము లోని అణువణువు ప్రాణశక్తితో నిండును.

**12. చదువురావటానికి - మాటలు రావటానికి**

1) సరస్వతీమంత్రము - **ఐం సరస్వత్యై నమః**

2) నీలసరస్వతి మంత్రము- **ఐం హ్రీం త్రీం నీలసరస్వతి స్వాహా**

3) వాగ్వాదినీ మంత్రము - **ఐం హ్రీం వదవద వాగ్వాదిని స్వాహా**

4) సరస్వతి చింతామణి మంత్రము - **ఐం హ్రీం ఐం**

5) మాతంగి మంత్రము - **ఐం హ్రీం క్లీం హూం మాతంగ్యై ఫట్ స్వాహా**

6) బాలామంత్రం - **ఐం క్లీం సౌః సౌః క్లీం ఐం**

లక్షజపము చేసి సరస్వతీ ఆకులు, పిప్పళ్ళు, వస, బోడసరము శొంఠి - వీనితో పదివేలు హోమం చేయవలెను.

మాటలు రానివారికి, రావటానికి పై మంత్రములను ఉపయోగించవచ్చును. అవికాక ఈ క్రింది మంత్రములు ఉపయోగించవచ్చును.

1) తారామంత్రము - ఓం హ్రీం స్త్రీం హూం ఫట్

2) హయగ్రీవ మంత్రము - హ్సౌం హయగ్రీవాయ నమః

3) గణపతి మంత్రము - ఐం గం ఐం గణపతయే నమః

**13. జ్ఞాపకశక్తి పెరగటానికి**

1) సరస్వతీ, తారా మాతంగీ, బాలా, హయగ్రీవ, గణపతి మంత్రములు

2) మేధా దక్షిణమూర్తి మంత్రము -

**ఓం నమో భగవతే దక్షిణామూర్తయే మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా**

**14. ధూమపానము, మద్యపానము మొదలైన వ్యసనాలు పోవటానికి**

ధూమావతీ మంత్రము - **ధూం ధూం ధూమావతిస్వాహా**

ఈమంత్రము రోజు 2100 జపించి కుంకుమ, నెయ్యి కలిపిన పిడికెడు అన్నము మంత్రించి కాకికి వేయవలెను.

**15. కామక్రోధ వికారములు తగ్గటానికి**

**1) తులసీమంత్రము : హ్రీం శ్రీం తులస్యై నమః**

ఈ మంత్రము రోజు ఒక మాల జపించి రెండు తులసి దళములు నమిలి మ్రింగవలెను.

**2) శాంతిమంత్రము : ఓం హ్రీం శం శాంతే ప్రశాంతే (అముక) క్రోధోపశమని స్వాహా**

అముక - స్థానములో తన కోసమైన 'మమ' అని ఇతరుల కోసమైన ఆ వ్యక్తి పేరు చెప్పవలెను. దీనికి పదివేలు జపము, ఆవునేతితో వేయి హోమము చేయవలెను.

**16. సౌందర్య సాధనలు**

1) శ్రీకృష్ణుని చిత్రముగాని విగ్రహమును గాని ఎదురుగా పెట్టుకుని ఈ క్రింది మంత్రమును జపించవలెను.

**"ఓం శ్రీం కృష్ణ సౌందర్య సిద్ధిం దేహి శ్రీం ఓం నమః"** పాలుకాని మధుర వస్తువుకాని నైవేద్యము పెట్టి పదివేలు జపము చేయవలెను.

**2) నేత్రసౌందర్యము కొరకు మంత్రము:**

**"ఐం శ్రీం క్లీం నయన మనోహరి స్వాహా, నయనాతి మనోహరి స్వాహా.**

ఈ మంత్రమును వెయ్యి యెనిమిది సార్లు జపించి తరువాత ప్రతిరోజు 108 సార్లు జపించి నీళ్ళతో కళ్ళు తుడుచుకొనవలెను. చూపులతో జనులను ఆకర్షించే శక్తి దీనివలన లభించును.

**3) ఆరోగ్య సౌందర్యములకు సూర్య మంత్రము :**

**"ఓం హ్రాం హ్రీం ఘృణి సూర్యాయ ఆదిత్యాయ నమః సౌందర్యం దేహి స్వాహా"**

ఆదివారము నాడు సూర్యునకు నమస్కరించి 1200 జపము చేసి ఆ తరువాత రోజు 108 చేయవలెను. గోధుమతో చేసిన చపాతీలను చిన్న ముక్కలు చేసి మేడమీద పెట్టుట కాని లేక చెఱువులో కాని, కాలువలో కాని వేయుట చేయవలెను.

**4) సౌకుమార్యమునకు, సౌందర్యమునకు చంద్రికా యక్షిణీ మంత్రము :**

**"ఓం హ్రీం సోం సః చంద్రికే ఆగచ్ఛ మమ ఇచ్ఛితం సాధయ స్వాహా'**

పూర్ణిమనాడు వెన్నెలలో 1008 జపము చేసి బియ్యముతో పాలతో చేసిన పాయసమును చంద్రమండలములో దేవత ఉన్నట్లుగా భావంచి సమర్పించవలెను. ఆ పాయసమును ప్రసాదముగా స్వీకరించవలెను.

**17. ఆరోగ్యమునకు ఊర్వశి మంత్రము :**

"ఓం ఐం హ్రీం శ్రీం ఊర్వశి గగనమార్గే ఆగచ్ఛ మమ ఈప్సితం కురు కురు స్వాహా.

పూర్ణిమనాడు 1008సార్లు జపించి గులాబిపూలను దేవతకు సమర్పించవలెను. తరువాత ప్రతిరోజు 108 జపియించుట మంచిది.

**18. శరీర దుర్గంధంపోవడానికి**

బుధవారం నాడుస్నానము చేసి తెల్లని వస్త్రములు ధరించి పడమటి వైపు తిరిగి కూర్చుని ఎదురుగా తెల్లని వస్త్రముపై కాసిని బియ్యము పోసి దానిపై తమలపాకు వేసి అమ్మవారి బొమ్మగాని, విగ్రహము గాని పెట్టి తామరగింజలమాలతో గాని, సుగంధ భరితమైన పూలతోగాని లెక్కించుచు ఈ క్రంది మంత్రమును 10 మాలలు జపియించవలెను.

**"ఓం క్లీం కామరూపిణ్యై నమః"**

**19. శారీరకమైన బలము పెంపొందడానికి :**

**1) "హుం హనుమతే నమః"**

**2) ఓం హుం వజ్రాంగబలాయ వీరహనుమతే నమః"**

ఈ మంత్రములను లక్షజము చేసి 10,000 హోమము చేయవలెను.

హోమద్రవ్యములు : మినపసున్ని, గారెముక్కలు, గేదె నెయ్యి,పండ్ల ముక్కలు.

3) "ఓం క్రోం శ్రీం హ్రీం ఐం సౌం హ్రీం నమః" బల, అతిబల, శక్తులతో కూడిన సిద్ధేశ్వరి మంత్రమిది. దీనిని కూడ పై మంత్రమువలెనే సాధన చేయవలెను.

ఈ మంత్రమును అన్ని రకముల సిద్ధి సాధనలకు ఉపయోగించవచ్చును. ప్రయోజనమును బట్టి హోమద్రవ్యములు మార్చుకొనవలసి యుండును.

**20. తలనొప్పి నివారణకు :**

**"ఓం అఘోరేశ్వరి ఘోరముఖి ఊర్ధ్వకేశి హ్రీం ఖ్యః హుం ఫట్ స్వాహా"**

ఇది అఘోరేశ్వరీ మంత్రము. మాసశివరాత్రినాడు కాని, అమావాస్యనాడు కాని 10,000 జపము చేయవలెను. ఆముదముతో కాని నువ్వులనూనెతో కాని 1000 హోమము. గన్నేరు పూలతో యూకలిప్టస్ ఆకులతో కూడా చేయవచ్చును.

**21. నడుమునొప్పి మొదలైనటువంటి నొప్పుల నివారణ కొరకు**

**"ఓం హ్రీం దుం దుర్గాయై నమః చులుచులు హులుహులు హ్రీం ఓం ఫట్"**

పూర్ణిమనాడు దీనిని 10,000 జపించవలెను. దుర్గాదేవిని ఎఱ్ఱనిపూలతో పూజించి ఎఱ్ఱనిపండ్లు లేక మధుర పదార్థములు నైవేద్యం పెట్టవలెను. మంత్రము జపించి బాధ ఉన్నచోట స్పర్శించినచో బాధ తగ్గును.

**కీళ్ళనొప్పులు, నడుము నొప్పి, మెడనొప్పి, వెన్ను నొప్పి మొదలైన వాటికి :**

**1) "ఓం హ్రీం సర్ప, సర్పసర్ప, దివ్య సర్ప, గగన సర్ప, గంధర్వసర్ప, కనకసర్ప, కారుణ్య సర్ప, మంత్ర సర్ప, మహాసర్ప, పీడా నివారణం కురు, వేధా నివారణం కురు, కురుకురు క్షేమం, శీఘ్రం కురుకురు, ఓం సమస్త సర్ప దేవతాభ్యో నమః"**

గ్రహణ సమయమున పట్టునుండి విడుపు వరకు జపించినచో మంత్రము సిద్ధించును. విడిగా చేసినచో పూర్ణిమనాడు కాని అమావాస్యనాడు కాని 3000 చేయవలెను. నాగచతుర్థినాడు, నాగపంచమినాడు కాని జపము చేసిన వేగముగా సిద్ధించును. జపము పూర్తి చేసిన తరువాత పాము పుట్టకు పూజ చేసి పాలు పండ్ల ముక్కలు నైవేద్యము పెట్టి అక్కడనే వుంచవలెను. ఇంటిలో జపము చేయునపుడు వెండి పాము బొమ్మపెట్టుకుని పాలు, చిమ్మిరి, నువ్వు ఉండలు, పండ్ల ముక్కలు నైవేద్యం పెట్టవలెను.

**2) "ఓం హూం వజ్రవైరోచనీయే ఉత్తరజాయఫట్"**

ఈ మంత్రమును కూడా పైదానివలెనేసాధన చేయవలెను.

**22. గాయము తగిలి నెత్తురు కారుతుంటే ఆపటానికి (రక్తస్రావ నివారణ)**

మంత్రము : ఇంద్రుడా ! చంద్రుడా ! దెబ్బ తగిలినది దేవేంద్రుడా ! నెత్తురు కట్టు నా గురువాన నా యాన.

**23. తేలు మంత్రములు**

1) సర ఫుః ఓం సరఫుః ఓం హిలి హిలి విసేహ ఫుః స్వాహా

2)ఫరౌన్ (అరబ్బీ మంత్రము)

3) శాబరము : గరిడ గరిడ ఊసిందాకా ఛీ పో

చాతక మాతక బంధో ఉఠో కఠో బంధో

తేలు కరిచిన వానిని గిరిగీసి దానిలో నిలబెట్టి ఒక కర్రపుల్ల తీసుకొని వానిని తాకించి మంత్రము మనస్సులో జపిస్తూ నేలమీద కొట్టిన బాధపోవును. ఇదిమాసా బత్తుల వీరయ్యగారు చెప్పిన మంత్రము.

**24. పాము మంత్రములు**

ఎ. 1) నాగాస్త్రము – ఓం ఉత్తర జాయ ఫట్

2) గారుడము – క్షిప ఓం స్వాహా

3) నీలకంఠము – ప్రోం ప్రీం ఠః

బి. పాముల నుండి తప్పించుకొనుటకు :

1) అస్తీక మంత్రము :

సర్పసర్ప మహాసర్ప గచ్ఛసర్ప మహావిష

జనమేజయస్య యజ్ఞాంతేఽస్తీక వచనం స్మర

(జనమేజయ యజ్ఞాంతే అస్తీకవచనం స్మర)

ఓం సర్పమా ! జనమేజయుని సర్పయాగము ఆపించిన అస్తీకునకు నాగజాతి ఇచ్చిన వరమును స్మరించుచున్నాను. నీవు వెంటనే దూరముగా వెళ్ళిపోవలసినది.

2) సర్పపలాయన మంత్రము : "జం ప్లః సర్పకులాయ స్వాహా

అశేష సర్పకులాయ స్వాహా"

సి. పాము కట్టు విప్పు మంత్రములు

కట్టుమంత్రము : ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌ సద్గురు చరణార విందేభ్యో నమః ఓం నమోభగవతేః హతమనభాషణాయ కలియుగమాభ్యా స్వాహా.

విప్పు మంత్రము : ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః సద్గురు చరణార విందేభ్యో నమః ఇగుళ్ళు భృగుళ్ళు నీలాద్రిభళీ హాహా.

**25. పూర్ణిమా సాధనలు :**

ఫాల్గుణ పూర్ణిమ నాడు ఈ సాధనలు వేగముగా ఫలించును.

1) **తలనొప్పి, నడుమునొప్పి మొదలగు బాధ నివారణ**

**ఓం చులుచులు హులుహులు ఓం పట్**

తలనొప్పి - 10 సార్లు నడుమునొప్పి - 61 సార్లు

కన్నుల తేజస్సు తగ్గితే - 21 సార్లు

దుస్స్వప్న నివారణ - నల్లదారంతో యంత్రం కట్టాలి.

2) **శీఘ్ర వివాహానికి**

**ఓం హ్రాం హ్రాం హ్రూం కార్యసిద్ధిం ఓం నమః**

పాలలో పసుపుకొమ్ము ఉంచి తలపై 5 సార్లు త్రిప్పి అగ్నిలో లేదా నీటిలో వేయాలి.

11సార్లు జపించి ఉత్తరంగా విసిరేస్తే కామ్యసిద్ధి

హోలీరాత్రి ధరిస్తే త్వరగా పెండ్లి

3) **గృహస్థ సుఖప్రాప్తి**

గులాబిరేకులపై పాలు పాయసం అభిషేకించి ఏదైనా జంతువుచే తినిపించాలి.

మంత్రం : **ఓం హ్రీం మమ సమీహితం సాధయసాధయ స్వాహా**

4) **యౌవనశక్తి :**

**ఓం నమః పుష్పధన్వాయ యౌవనం దేహి ఓం**

మునివేళ్ళపై నిలబడి జపించాలి (21 సార్లు)

5) **ఉద్యోగంలో ప్రమోషన్ :**

**ఓం అం హ్రాం క్ష్వీం ఓం ఫట్**

ఆఫీసులో స్థాపన - అగ్నిలో మంత్రాహుతులు

6) **భూత బాధా నివారణ**

**ఓం కాళి రౌద్రి కపాలిని భూతబాధా ప్రేతబాధా నివారిణి మాం రక్ష రక్ష (సిద్ధి ర్గురు ప్రసాదేన ఓం ఫట్ - పదివేలు జపం.)**

7) **నూతన గృహప్రాప్తి**

**ఓం కాళి మహాకాళి ఓం ఠః ఠః స్వాహా**

21 మాలలు జపించి మాలా, యంత్రము ఇంటి బయట పూడ్చి పెట్టాలి.

**26. దొంగతనము జరుగకుండా ఉండటానికి**

ఎ) ఇంటిలో దీపము వెలిగించి కార్తవీర్యార్జునుని నామము 3 సార్లు స్మరియించి ఈ క్రింది మంత్రమును జపియించవలెను.

మం॥ "కార్తవీర్యార్జునో నామ రాజా బాహుసహస్రవాన్
యస్య స్మరణమాత్రేణ చోరబాధా విముచ్యతే

**బి) పోయిన సొమ్ము రావడానికి:**

ఇంటిలో దీపము వెలిగించి పై దాని వలెనే కార్తవీర్యార్జున మంత్రము జపియించ వలెను. ఈ మంత్రం లక్ష జపం చేయవలెను.

మం॥ **"కార్తవీర్యార్జునో నామ రాజా బాహుసహస్రవాన్**
**యస్య స్మరణమాత్రేణ హృతం నష్టంచ లభ్యతే"**

సి) దొంగలు ఎదిరించినపుడు వారిని కదలకుండా చేసి తప్పించుకోటానికి కార్తవీర్యార్జున మంత్రము

మంత్రము : **ఓం నమః కార్తవీర్యార్జునాయ మమ సర్వశత్రుచోరవ్యాఘ్ర వరాహాది సమస్త గ్రహ చోరాది హస్త పాదాది వక్త్ర సర్వాణ్యంగాని ఠ ఠ ఠ ఠ స్తంభయ స్తంభయ బంధనం కురుకురు స్వాహా.**

ఇది లక్ష చేసినచో అన్ని విధములైన ఆపదలు నివారించబడును.

**27. తప్పిపోయిన మనిషి తిరిగి రావడానికి :**

ఆదివారము నాడు ఎఱ్ఱచందనపు పొడి, కుంకుమ, గోరోచనము నీళ్ళతో కలిపి ద్రవము చేసి దానితో తెల్లని వస్త్రముపై మనిషి బొమ్మ గీసి దానిక్రింద పేరు వ్రాసి దానిపై వీలేతై ఆ మనిషి ఫోటో పెట్టాలి. ఇదంతా ఇష్టదేవత యొక్క చిత్రము లేక విగ్రహము ముందు ఏర్పాటు చేసికోవాలి. అగరువత్తులతో, ధూపము వేసి, నువ్వుల నూనెతో దీపము వెలిగించి ఈ క్రింది మంత్రాన్ని లక్షజపం చేయాలి. ఉత్తరదిక్కు వైపు తిరిగి రుద్రాక్షమాలతో జపం. ఎఱ్ఱని వస్త్రము ఆసనముపై పరిచి కూర్చోవాలి.

మంత్రము : **"ఓం ఆం హ్రీం క్రోం అముకం వేగవేగ ఆకర్షయ**
**ప్రస్థాపయ ప్రస్థాపయ ఆగచ్ఛ మణిభద్రస్వాహా"**

లక్షజపం పూర్తయిన తరువాత "అముకం" అనే పదం స్థానంలో రప్పించవలసిన వ్యక్తిపేరు ఉంచి 51,000 జపం చేయాలి. ఒక వారం రోజులు చూసి కార్యసిద్ధి కలుగక పోయిన ఎడల పై మంత్రముతో 10,000 హోమము చేయవలెను. నువ్వులు, బియ్యము, నువ్వులనూనె ఎఱ్ఱని అక్షతలు, ఎఱ్ఱని పూలు హోమద్రవ్యము.

**28. విదేశగమన సిద్ధి**

శుక్రవారము నాడు తెల్లనివస్త్రముపై కుంకుమపువ్వుతో 'స్వస్తిక్' వేసి దానిపై దక్షిణావృత్త శంఖాన్ని ఉంచి ధూప, దీప, పుష్ప, నైవేద్యములు సమర్పించి తెల్లని వస్త్రముపై కూర్చుని స్ఫటికమాలతో పడమటివైపు తిరిగి 5 రోజులలో 11000 జపం పూర్తి చేయవలెను. తరువాత ఆ తెల్లనివస్త్రములో శంఖము మూటగట్టి పూజామందిరంలో ఉంచవలెను. ఈ విషయములో ఆటంకములు కలిగినవారు లక్ష జపము చేసి 10,000 హోమం చేయుట మంచిది.

మంత్రము : **"ఓం హ్రీం క్లీం అనంగ వల్లభాయై విదేశగమనాయ కార్యసిద్ధ్యర్థే నమః"**

ఇదే కార్యసిద్ధికి ఆంజనేయ మంత్రం.

ధ్యానం : **మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం**
**వాతాత్మజం వానరయూధ ముఖ్యం శ్రీరామదూతం శిరసానమామి.**

మంత్రము : **"ఓం లం వం రం యం హం హనుమతే నమః"** విధానము పై వలెనే.

**29. దారిద్ర్య నివారణ**

శనివారము నాడు మొదలు పెట్టి నల్లని వస్త్రములు ధరియించి రుద్రాక్షమాలతో గాని లేక 108 మిరియాలతో గాని దక్షిణము వైపు తిరిగి ధూమావతి మంత్రమును జపియించవలెను.

మంత్రము : **"ధూం ధూం ధూమావతి స్వాహా"**

ప్రతిరోజూ పిడికెడు అన్నం తీసుకుని దానిలో కొంచెం కుంకుమ నెయ్యి కలిపి ఆ ఎర్రని ముద్దను చేతిలో పట్టుకుని మంత్రించి తలచుట్టూ 3 సార్లు తిప్పుకుని కాకులకు బలిగా పెట్టవలెను. లక్షజపం చేసి, పదివేలు నల్లని నువ్వులతో,మిరియాలతో, ఆవాలతో హోమం చేయవలెను.

**30. ఇళ్ళు స్థలాలు త్వరగా అమ్ముడు పోవటానికి :**

ఆ స్థలములోని మట్టిని తెచ్చి రాగిప్లేటులో పెట్టి దానిపై వినాయకుని లేక మాతంగి బొమ్మ పెట్టి పూజ చేసి గణపతిమంత్రము గాని, మాతంగీ మంత్రము గాని 40 వేలు చేసి పసుపు కుంకుమలు సమర్పించి ఆ మట్టిని స్థలము నందు చల్లినచో త్వరలో అమ్మకమగును.

1) గణపతి మంత్రము - **ఓం గం గణపతయే నమః**

2) మాతంగీ మంత్రము - **ఓం హ్రీం క్లీం హూం మాతంగ్యై ఫట్ స్వాహా.**

**31. పంటలు బాగా పండటానికి**

1) వారాహీ మంత్రము - గ్లౌం వారాహి స్వాహా

2) గణపతి మంత్రము - ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే నమః

ఈ మంత్రములలో ఏదో ఒకటి లక్ష చేసి జపజలము స్థలములో, పొలములో చల్లవలెను.

**32) నూతన గృహప్రాప్తికి :**

25 నెంబరులో ఇవ్వబడినది. 31 నెంబరులోని మంత్రములు కూడా దీని కుపయోగించును.

**33. సుఖప్రసవానికి**

మంత్రము :

**1) హిమవ త్యుత్తరే పార్శ్వే చపలా నామ యక్షిణీ**
**తస్యా నూపురశబ్దేన విశల్యాభవ గర్భిణి**

**2) గోదావరీ అస్తితీరే జంభలా నామ రాక్షసీ**
**తస్యా స్మరణ మాత్రేన విశల్యా గర్భిణీ భవేత్**

గర్భిణీ స్త్రీలు లేని చోట ఈ మంత్రమును పదివేలు జపము చేయవలెను. తర్వాత గర్భవతులు నెలలు నిండి నొప్పులు పడుతున్నప్పుడు ఈ మంత్రము చేసి తీర్థమిచ్చుట గాని, కుంకుమ ధరింప జేయుటగాని చేసిన సుఖముగా ప్రసవించును.

**34. బధిరత్వ నివారణకు (చెముడు పోవటానికి)**

1) **నాగమంత్రము - ఓం చక్షు శ్రవాయ ఉత్తరజాయ ఫట్**
ఈ మంత్రము లక్ష జపించి పాము పుట్టకు పూజ చేయవలెను.

2) **భైరవమంత్రము - ఓం భం భైరవాయ నమః**
లక్షజపము, దశాంశహోమము - మిరియాలు ఆవాలతో చేయవలెను.

3) **భ్రమరాంబా మంత్రము : భ్రాం భ్రీం భ్రూం భ్రామరి స్వాహా**
శ్రీ శైలములో లక్ష జపము చేసిన వేగముగా సిద్ధించును.

**35. నేత్రరోగ నివారణ**

1) లలితామంత్రము - హ్రాం హ్రీం సః
10,000 జపం చేసి జలముతో కన్నులు తుడవవలెను.

**2) నాగమంత్రము : ఓం హ్రాం హ్రీం హూం ఉత్తరజాయఫట్**

లక్షజపము, దశాంశహోమము - హోమద్రవ్యములు నేయి, మిరియాలు, మారేడు దళాలు, వేప సమిధలు.

3) సూర్యమంత్రము - చక్షుష్మతీ విద్య - విశ్వామిత్రుని పుత్రుడు భగవాన్ సాంకృతి దర్శించిన మంత్రము.

ఓం హ్రాం హ్రీం హూం నమో భగవతే శ్రీ సూర్యాయ అక్షితేజసే నమః లక్షజపము చేసి, నేతితో, నేతిలో తడిపిన గోధుమలతో హోమము చేయవలెను. ప్రతిరోజు నానవేసిన గోధుమలను మంత్రించి పక్షులకు సమర్పించవలెను.

**36. దిష్టి మంత్రము - దృష్టి దోష నివారణ (క్షుద్రవిద్యలకు 74వ నెంబరు మంత్రము)**

1) కాళీ వైరోచనీ మంత్రము
క్రీం హ్రీం హూం కాళి వజ్రవైరోచనీయే ఫట్ స్వాహా

2) ప్రత్యంగిరా మంత్రము
క్షం హ్రాం హ్రీం భక్ష జ్వాలాజిహ్వే కరాళదంష్ట్రే ప్రత్యంగిరే క్షం హ్రాం హ్రీం హుం ఫట్ స్వాహా.

3) ఓం జూం హూం భం కాల భైరవాయ నమః
ఇవే కాక హనుమాన్, నారసింహ, దుర్గాది తీవ్రమంత్రము లేవైన దృష్టి దోష నివారణకు ఉపయోగించును. పురశ్చరణ చేసిన తర్వాత ఉపయోగించవలెను.

**37. ఉద్యోగ ప్రాప్తికి :**

1) గణపతి మంత్రము లేవైననూ ఉపయోగించవచ్చును. విజయ గణపతి ప్రత్యేకముగా ఇవ్వబడుచున్నది.

మం॥ ఓం హ్రీం శ్రీం గ్లాం గం వరవరదాయ విజయగణపతయే నమః

2) మాతంగీ మంత్రము: ఓం హ్రీం క్లీం హూం మాతంగ్యై ఫట్ స్వాహా.

3) సువర్ణతారా మంత్రము: క్లీం త్రీం హూంవజ్రవైరోచనీయేస్వర్ణతారాయై ఫట్.

పై మంత్రములు లక్షజపము; నువ్వులు, నువ్వులనూనె ఎర్రని అక్షతలతో పదివేలు హోమము.

**38. బదిలీలు కావడానికి :**

పైన చెప్పిన గణపతి, మాతంగీ మంత్రములు ఉపయోగించవచ్చును.

**39. ఇంటర్వ్యూలలో విజయానికి**

పైన చెప్పిన గణపతి, మాతంగీ మంత్రములను ఉపయోగించవచ్చును.

**40. కోర్టు వివాదములలో గెలుపు పొందుటకు :**

పైన చెప్పిన గణపతి మాతంగి మంత్రముల ఉపయోగించవచ్చును. చండీ సప్తశతిలోని మహామాయా మంత్రమును దీనికి ఉపయోగించుట చాలా ప్రాంతములలో ఉన్నది.

మం॥ ఓం హ్రీం ఈం

**జ్ఞానినా మపి చేతాంసి దేవీ భగవతీ హి సా**

**బలా దాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి ఈం హ్రీం ఓం.**

నలభై వేలు జపము. నువ్వులు, నువ్వులనూనె, ఎర్రటి పూలు, ఎర్రటి అక్షతలతో పదవవంతు హోమం.

**41. కారాగార విముక్తికి : (జైలు నుండి విడుదల)**

బందీ దేవీ మంత్రములు

**1) ఏకాక్షరి : ఠీం**

**2) హిలిహిలి బందీదేవ్యై నమః**

**3) కాళీ హనుమాన్ మంత్రము : ఓం క్రీం హ్రీం కాళి మహాకాళి హరి మర్కట మర్కటాయ స్వాహా.**

బలాత్కారముగా ఎత్తుకొని పోబడిన వారికి గూడ ఈమంత్రములు చేయవచ్చును.

**42. భయనివారణకు :**

**1) దుర్గామంత్రము : ఓం హ్రీం దుం దుర్గాయై నమః**

**2) వనదుర్గా మంత్రము :**

**ఓం హ్రీం దుం ఉత్తిష్ఠ పురుషి కిం స్వపిషి భయం మే సముపస్థితం యదిశక్య మశక్యం వా తన్మే భగవతి శమయ శమయ స్వాహా.**

(పౌరుషం మూర్తీభవించిన ఓ దుర్గా ! నిద్రపోతున్నవా ఏమి ? ఏమో నాకు భయము కల్గుచున్నది. శక్యమైనా అశ్యమైనా ఆ భయమును శాంతింప చేయుము.

**3) సప్తశతిలోని దుర్గామంత్రము :**

**శ్లో॥ దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః**

**స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాన్ దదాసి**

**దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా**

**సర్వోపకార కరణాయ సదార్ద్ర చిత్తా.**

ఓ దుర్గా !నిన్ను స్మరించిన వారి భయమును వెంటనే హరించెదవు. సుఖముగా నున్న వారు స్మరించినచో అధిక శుభములను ప్రసాదింతువు. దారిద్ర్యమును, భయమును,

దుఃఖమును పోగొట్టుటలో నీ కంటె వేరెవ్వరున్నారు. సర్వులకూ ఉపకారము చేయుటకు నీ వెప్పుడూ దయార్ద్ర చిత్తముతో ఉందువు).

4) **భద్రకాళీ మంత్రము :**

**భద్రకాళి మహాకాళి కిలి కిలి ఫట్ స్వాహా**

**లక్షజపం, దశాంశ హోమం ఎర్రని నైవేద్యము.**

**43) వ్యాపార నష్ట నివారణకు :**

**ధూమావతి మంత్రము :** ధూం ధూం ధూమావతిస్వాహా ।

లక్షమంత్రజపము చేసి నల్లని మిరియాలతో ఆవాలతో పదివేలు హోమం చేయవలెను. ప్రతిరోజు కుంకుమ, నెయ్యి కలిపిన అన్నం దేవతకు బలిగా సమర్పించి కాకికి వేయవలెను.

**44. వ్యాపార వృద్ధికి :**

**1) లక్ష్మీమంత్రము : శ్రీం మహాలక్ష్మ్యై నమః**

**2) లక్ష్మీగణపతి మంత్రము : శ్రీం గ్లౌం శ్రీం వరవరద శ్రీ లక్ష్మీ గణపతయే నమః**

**3) లలితా మంత్రము : క ఏ ఈ ల హ్రీం హసకహల హ్రీం సకలహ్రీం**

లక్ష జపము ఎర్రని పూలు, ఎర్రని అక్షతలు, నువ్వులు, బెల్లము, మారేడు దళములు, మారేడు పండ్ల ముక్కలు, మారేడు సమిధలు, నువ్వులనూనె, గేదెనెయ్యి, తామరపూలు హోమద్రవ్యములు.

**45) ఋణ విమోచనకు :**

**1) ఋణ హర్తృ గణపతి మంత్రము :**

ధ్యానము : సింధూరవర్ణం ద్విభుజం గణేశం
లంబోదరం పద్మదళే నివిష్టం
బ్రహ్మాది దేవైః పరిసేవ్య మానం
సిద్ధైర్యుతం తం ప్రణమామి దేవం.

**మంత్రం : ఓం హ్రీం గ్లౌం గం గణేశ ఋణంఛింది వరేణ్యం హుం నమః ఫట్.**

లక్షజపము. కుడుములు, ఉండ్రాళ్ళు, నువ్వులు, బెల్లము, ఎండుకొబ్బరి తురుము పండ్లముక్కలు, హోమ ద్రవ్యములు – దశాంశం హోమం.

**2) అంగారక మంత్రము :** బొగ్గుపొడితో అంగారక యంత్రము వేయవలెను. లేదా బొగ్గుపొడిని రాగిరేకుపై గీసిన అంగారక యంత్రముపై పెట్టవలెను. అంగారక

మంత్రమును మంగళవారము నాడు జపించి ధూపదీప నైవేద్యములు చేయవలెను. పదివేలు జపము చేయుచు ప్రతి వేయి పూర్తి కాగానే యంత్రము చుట్టూ బొగ్గుతో గీట్లు గీయవలెను. ఈ విధముగా పది మంగళవారములు చేయవలెను. జపము మిగతా రోజులలో కూడా చేయవచ్చును. హోమము చంద్రసమిధలతో చేయవలెను.

మంత్రము : **ఓం రం అంగారకాయ నమః**

**46. జ్వరనివారణకు :**

పురశ్చరణ చేసిన మహామంత్రములేవైననూ జ్వరనివారణకు వాడవచ్చును. ప్రత్యేకముగా జ్వరనివారణ మంత్రములు:

1) **ఓం హ్రీం కుబేరం తే ముఖంరౌద్రం నంది న్నానంద మావహ**
**జ్వరం మృత్యుభయం ఘోరం విషం నాశయమే జ్వర.**

2) **ఓం హ్రీం జ్వరరాజాయ విద్మహే త్రిశిరస్కాయ ధీమహి**
**తనోః జ్వరః ప్రచోదయాత్.**

3) **సముద్రస్యోత్తరే తీరే ద్వివిదో నామ వానరః**
**తస్య మూత్ర పురీషాభ్యాం హుతాశన శమయశమయ స్వాహా**

4) **భస్మాయుధాయ విద్మహే తీక్ష్ణ దంష్ట్రాయ ధీమహి**
**తన్నో జ్వరహరః ప్రచోదయాత్.**

ఈ మంత్రములను పదివేలు జపము చేసి ఉపయోగించు కొనవచ్చును.

5) శీతలామంత్రము:

ధ్యానము : నమామి శీతలాందేవీం రాసభస్థాం దిగంబరాం
మార్జనీ కలశోపేతాం శూర్పాలంకృత మస్తకాం.

గాడిదమీద ఎక్కి చేట శిరస్సున పెట్టుకుని ఒక చేతిలో చీపురు మరొక చేతిలో నీటి పాత్ర ధరించి దిగంబరయై ప్రకాశించే శీతలాదేవికి నమస్కరిస్తున్నాను.

మంత్రములు: **1) హ్రీం శ్రీం శీతలాయై నమః**
**2) హ్రీం శ్రీం శీతలే శీతలే స్వాహా**

నడుములోతు నీళ్ళలో నిలబడి పదివేలు జపము చేసిన మంత్రము సిద్ధించును. అది వీలుకానిచో తడిగుడ్డ కట్టుకుని జపము చేయవచ్చును.

6) **అర్ధపటి మంత్రము : ఓం హ్రీం అర్ధపట 'అర్ధపట మహాపట మహాపట హుం ఫట్ స్వాహా**

తడిగుడ్డలు ధరించి లక్ష జపం చేసిన మంత్రము సిద్ధించును. ఇది జ్వర నివారణకే కాక జ్వరప్రయోగమునకు కూడా ఉపయోగించవచ్చును. మంత్రసిద్ధి అయిన తరువాత

తడిగుడ్డ చుట్టుకుని జపము చేసినచో గుడ్డ ఆరిపోయేసరికి శత్రువునకు జ్వరము వచ్చును.

**47. మానసిక అశాంతి పోవటానికి :**

1) చంద్రమంత్రము : సోం సోమాయ నమః

2) చంద్రకాళీమంత్రము : ఓం హ్రీం శ్రీం సః శ్మశానవాసిని చంద్రకాళి స్వాహా.

పై రెండు మంత్రములు ముత్యాలమాలతో లక్ష జపము చేసి దశాంశము పాలతో కాని, నేతితో కాని తడిపిన బయ్యముతో లేక పాయసముతో హోమము చేయవలెను. ఒక గిన్నెలో పాలుపోసి వెన్నెలలో నిల్చుని చంద్రుని కిరణములు పాలలో పడుచుండగా 108 సార్లు జపము చేసి అది ప్రసాదముగా ఇచ్చిన మనశ్శాంతి కల్గుటయే కాక ఆరోగ్యము కూడా లభించును.

**48. అకాలమృత్యు నివారణకు :**

**1) మృత్యుంజయ మంత్రము : ఓం జూం సః**

**2) త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం**
**ఉర్వారుకమివ బన్ధనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్.**

ఇది రుద్రుడు అధిదేవతగా కలమృత్యుంజయమంత్రం. ఇందులోని త్ర్యంబక శబ్దమునకు మూడు కన్నులు గలవాడు. రుద్రుడు అనియే కాక సాయణాచార్యులవారు త్రి-త్రిమూర్తులకు అంబకము - తల్లి అయినది అనగా మూలమైనది అని వ్యాఖ్యానించి పరబ్రహ్మతత్త్వమునకు అన్వయించిరి కనుక అన్ని సంప్రదాయముల వారు దీని నుప యోగించవచ్చును.

**3) కాలభైరవ మంత్రము : ఓం జూం హూం భం కాలభైరవాయ నమః.**

దీనిని లక్ష జపము చేసి దశాంశము హోమము చేసి నైవేద్యముగా గారెలు లేక ఎరుపు లేక నలుపు మధుర పదార్థములు సమర్పించి వానిలో కొంతభాగము కాలభైరవుని వాహనమైన శునకమునకు సమర్పించవలెను. వ్యాధిగ్రస్తులు జపము చేసి స్పర్శించిన నైవేద్యమును కుక్కకు పెట్టిన వ్యాధి తొందరగా నయమగును.

**49. హృద్రోగ నివారణకు :**

పై మంత్రముల నుపయోగించవచ్చును. వీటితో పాటు సూర్యమంత్రము కూడా వాడవచ్చును.

**మం॥ ఓం హ్రాం హ్రీం హూం ఘృణి సూర్యాయ ఆదిత్యాయ సర్వరోగం నివారయ నివారయ నమః**

ప్రతిరోజు నానపెట్టిన గోధుమలు మంత్రించి రోగిచే తాకించి పక్షులకు,

జలచరములకు వేయవలెను. ఆవుకు పెట్టుట శ్రేష్ఠము.

**50) కేన్సర్ వ్యాధి నివారణకు :**

పై మంత్రసాధనలతో పాటు ప్రత్యంగిరా, ధూమావతి మంత్రములు ఉపయోగించవచ్చును. ఇవి కాక నాగాస్త్ర మంత్రమును కూడ దీనికి ఉపయోగించ వచ్చును.

**51) స్త్రీల రజస్సంబంధిత బాధా నివారణకు**

ఉచ్ఛిష్టమాతంగి మంత్రం

**1) ఐం నమ ఉచ్ఛిష్ట చాండాలి మాతంగి సర్వవశంకరి స్వాహా**

**52) కిడ్నీ వ్యాధుల నివారణకు :**

ధూమావతి, కాలభైరవ, ప్రత్యంగిర మొదలైన మంత్రములను ఉపయోగించ వచ్చును.

**53) ఉబ్బసము, ఆయాసము, పోవుటకు :**

**1) వాయు మంత్రము : యం వాయవే నమః**

**2) గణపతి మంత్రము : ఓం గం గణపతయే మూషికవాహనాయ నమః**

ఈ మంత్రము జపించి ఎలుకలు పందికొక్కులు తిరుగుచోటు వాటికి ఆహారము వేయవలెను.

3) ధూమావతి, బగళా మంత్రములను ఉపయోగించవచ్చును.

**4) చంద్రమంత్రము : సోం సోమాయ నమః**

**5) చంద్రకాళీ మంత్రము : ఓం హ్రీం శ్రీం సః చంద్రకాళి స్వాహా.**

**54. చక్కెరవ్యాధి (షుగర్) నివారణకు :**

కాళి, తార, ఛిన్నమస్త, ప్రత్యంగిర, సూర్యమంత్రములలో దేనినైనను జపించి వేపసమిధలు, మెంతులు, పచ్చికాకరకాయ ముక్కలు మొదలైన చేదువస్తువులతో హోమం చేయవలెను. ఇవి కాక

ఓం బృహస్పతయే నమః అను బృహస్పతి మంత్రము, నవగ్రహములలో గురు మంత్రమునకు చెప్పిన సాధన చేయవచ్చును.

**55. ఎముకల వ్యాధి నివారణకు :**

**1) ఛిన్నమస్త మంత్రము : హ్రాం హ్రీం హూం వజ్రవైరోచనీయే ఫట్ స్వాహా**

**2) నాగాస్త్రమంత్రము : ఓం హ్రాం హ్రీం హూం ఉత్తరజాయ ఫట్.**

**3) ఎముకల కాన్సరుకు : లలితామంత్రము : ఓం హ్రీం మజ్జా సంస్థాయై లలితాయై నమః**

ఎముకల క్షయవ్యాధి : ఛిన్న మస్తా మంత్రము ఉపయోగిచవచ్చును.

చంద్రకాళీమంత్రము : **ఓం హ్రీం శ్రీం సః చంద్రకాళిస్వాహా.**

ఇది అన్ని విధములయిన క్షయవ్యాధులకు పనిచేయును.

**56. మారీ స్ఫోటకములకు : (మారి - కలరా; స్ఫోటకము - స్మాల్ పాక్స్)**

**1) శీతలా మంత్రము : 1) హ్రీం, శ్రీం శీతలాయై నమః**

**2) ఓం హ్రీం శ్రీం శీతలే స్వాహా**

**2) మాంతంగీ మంత్రము : హ్రీం క్లీం హూం మాతంగ్యై ఫట్ స్వాహా.**

**57. ఉన్మాద నివారణకు :**

**1) భైరవ మంత్రము : ఓం ఉన్మత్త భైరవాయ నమః** ఉమ్మెత్త ఆకులతో గింజలతో హోమము.

**2) చంద్రకాళీ మంత్రము : ఓం హ్రీం శ్రీం సః శ్మశానవాసిని చంద్రకాళిస్వాహా**

**3) చంద్రమంత్రము : సోం సోమాయ స్వాహా. (2, 3 మంత్రములను వెన్నెలలో పాలతో లేక బియ్యపు పాయసముతో మంత్రించి యియ్యవలెను).**

**58. నిద్రలేమి :**

**1) ధూమావతి మంత్రము : ధూం ధూం ధూమావతి స్వాహా పదివేలు జపము.**

**2) నిద్రామంత్రము : అశుద్ధే శుద్ధరూపే శుద్ధయోగిని మహానిద్రే స్వాహా** పదివేలు జపము చేసి నువ్వులు కాసిని తలపై చల్లుకున్న నిద్రవచ్చును.

**3) చండీమంత్రము : యా దేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా**

**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః**

4) **ఓం నమో భగవతే రుద్రాయ నిద్రాం స్తంభయ స్తంభయ ఠః ఠః ఠః (నిద్ర ఆగుటకు)**

**59. లలిత కళల నైపుణ్యమునకు :**

**1)** మాతంగీ మంత్రము : ఓం హ్రీం క్లీం హూం మాతంగ్యై ఫట్ స్వాహా

2) ఐం మాతంగి స్వాహా

**3)** తారామంత్రము : ఓం హ్రీం త్రీం హూం ఫట్ స్వాహా

**4)** నీలసరస్వతీ మంత్రము : క్రీం హ్రీం క్లీం తారే నీలసరస్వతి స్వాహా

**5)** సరస్వతీ మంత్రం : **1)** ఐం సరస్వత్యై నమః

**2)** ఐం క్లీం వదవద వాగ్దేవతే స్వాహా

**60. ఆపదలు ఉపద్రవములు తొలగుటకు :**

**1) ఘంటాకర్ణమంత్రము : ఓం హూం ఘంటాకర్ణ మహావీర సర్వోపద్రవ నాశనం కురుకురు స్వాహా**

కాశీలో ఘంటాకర్ణ తీర్థము కలదు. గుజరాత్‌లో అహమ్మదాబాదు దగ్గర జైనుల ఘంటాకర్ణ ఆలయం కలదు. ఈ మంత్రమును వానిలోగాని శివాలయములో కానీ జైనుల పార్శ్వనాథాలయములో కాని జపించిన త్వరగా సిద్ధించును. పదివేలు జపము.

**2) కృత్యామంత్రము : ఓం క్లీం క్లీం హూం హూం శత్రూన్ మోహయ ఉచ్చాటయ మారయ వచన సిద్ధి మమ ఆజ్ఞాం పాలయ పాలయ కృత్యాసిద్ధి ఫట్.** పదివేల జపం.

**61. జనవశీకరణము :**

**1) ఆసురీ దుర్గ : మంత్రము : ఓం కటుకే కటుకపత్రే సుభగే ఆసురీ రక్తే రక్తవాససే ఆధర్వణస్యదుహితే అఘోరే అఘోరకర్మకారికే అముకస్య గతిం దహ దహ ఉపవిష్టస్య గుదం దహదహ సుప్తస్య మనో దహదహ ప్రబుద్ధస్య హృదయం దహదహ హనహన పచపచ తావద్దహ తావత్ పచ యావన్మే వశమాయాతి హుం ఫట్ స్వాహా.**

పదివేల జపం : ఆవాలతో దశాంశ హోమం. తేనె కూడ హోమమునకు వాడవచ్చును. ఎంతటి వారినయినా ఈ మంత్రముతో వశము చేసుకొనవచ్చును. తేనెతో వెయ్యి ఆహుతులు వేసినచో సామాన్యవశీకరణము శక్తిసంపన్నులయిన వారిని దుష్టులను వశీకరణము చేయుటకు ఆవపిండితో వారి బొమ్మను చేయవలెను. దానిని కత్తితో నూట ఎనిమిది ముక్కలు చేసి హోమము చేయవలెను. పురుషుడయినచో కుడికాలితో మొదలు పెట్టి స్త్రీ అయినచో ఎడమ కాలితో మొదలు పెట్టి తలవరకు పిండి బొమ్మను నరుకుతూ ఆహుతులు వేయవలెను. ఎంతవారయినను దాసులగుదురు. ఆవనూనెతో నల్లఆవాలను వేపాకులను తడిపి హోమం చేసినచో శత్రువునకు జ్వరము వచ్చును. ఉప్పు ఆవాలు కలిపి వేసిన స్ఫోటకము వచ్చును. జిల్లేడు పాలతో కలిపిన ఆవాలతో హోమం చేసినచో శత్రువునకు కంటిచూపు నశించును. నీళ్ళకుండలో మొలకెత్తిన ఆవచిగుళ్ళను వేసి మూడుసార్లు మంత్రము జపించి ఎవరిపైనయినా నీళ్లు చల్లినచో వారి ఆధివ్యాధులు దారిద్ర్యము నశించును. ఈ విధంగా ఈ విద్యను అన్ని ప్రయోజనములకు వినియోగించవచ్చును.

**62. నవగ్రహ శాంతి సాధనలు**

**1) సూర్యుడు :**

**మంత్రములు : 1) హ్రాం సూర్యాయ నమః**

**2) ఓం హ్రీం ఘృణి స్సూర్య ఆదిత్య శ్రీం**

సూర్య యంత్రము గాని, లేక కెంపుగాని పెట్టి జిల్లేడుపూలతో పూజచేసి జపం

చేయవలెను. ఎర్రని వస్త్రము ధరించవలెను. జపము తర్వాత జిల్లేడు సమిధలతో నేతితో కుంకుమతో కలిపిన గోధుమలతో హోమము చేయవలెను. గోధుమలను దానము చేయుట మంచిది.

**2) చంద్రుడు**

**మంత్రములు : ఓం హ్రీం సోం సః సోమాయ చంద్రాయ నమః**

చంద్రయంత్రము గాని, ముత్యము గాని పెట్టి పూజ చేయవలెను. మోదుగ సమిధులతో, నేతితో కలిపిన బియ్యముతో హోమము చేయవలెను. బియ్యము దానము చేయవలెను. వెన్నెలరోజులలో ముఖ్యముగా పూర్ణిమనాడు వెన్నెలలో ఒక గిన్నెలో బియ్యముతో చేసిన పాయసం ఉంచి మంత్రము వీలైనంత జపించి ప్రసాదముగా స్వీకరించవలెను. జపము తెల్లనివస్త్రములు ధరించి చేయవలెను.

**3) కుజుడు :**

**మంత్రములు : 1) ఓం హ్రీం కుం కుజాయ నమః**
**2) ఓం రం అంగారకాయ నమః**

కుజయంత్రమును గాని, పగడమును గాని పెట్టి ఎర్రని గుడ్డలు ధరించి ఎర్రని పూలతో పూజచేసి జపము చేయవలెను. చంద్రసమిధలతో నేతితో కలిపిన కందులతో హోమము చేయవలెను. కందులు దాన మీయవలెను.

**4) రాహువు**

**మంత్రములు : ఓం హ్రీం రం రాహవే నమః**

రాహు యంత్రము గాని, గోమేధికమును గాని పెట్టి నల్లని వస్త్రములు ధరించి నల్లనిపూలతో గరికతో, పూజచేసి జపము చేయవలెను. గరికతో, నెయ్యి కలిపిన మినుములతో హోమము - మినుములను దానమీయవలెను.

**5) గురువు :**

**మంత్రములు : ఓం హ్రీం గుం గురవే బృహస్పతయే నమః**

గురు యంత్రమును గాని, పుష్యరాగమును గాని పెట్టి, పసుపు పచ్చని గుడ్డలు ధరించి పసుపుపచ్చని పూలతో పూజచేసి జపము చేయవలెను. రావి సమిధలతో, నెయ్యి కలిపిన శనగలతో హోమము. శనగలను దానము చేయవలెను.

**6) శని**

**మంత్రము : ఓం హ్రీం శం శనైశ్చరాయ నమః**

శనియంత్రమును గాని ఇంద్రనీలమును గాని పెట్టి నల్లని వస్త్రములు ధరించి నల్లని పూలతో నలుపురంగు కలిపిన అక్షతలతో పూజచేసి జపము చేయవలెను. జమ్మి

సమిధలతో నల్లనువ్వులతో హోమము. నల్లనువ్వులు దానము చేయవలెను.

**7) బుధుడు :**

**మంత్రము : ఓం హ్రీం బుం బుధాయ నమః**

బుధ యంత్రమును గాని, పచ్చను గాని పెట్టి ఆకుపచ్చ గుడ్డలు ధరించి ఆకుపచ్చ పూలతో, ఆరంగు కలిపిన అక్షతలతో పూజ చేసి జపము చేయవలెను. ఉత్తరేణు సమిధలతో నెయ్యి కలిపిన పెసలతో హోమము. పెసలు దానము చేయవలెను.

**8) కేతువు :**

**మంత్రము : ఓం హ్రీం కం కేతవే నమః**

కేతు యంత్రమును గాని, వైడూర్యము గాని పెట్టి రంగు రంగుల వస్త్రము ధరించి వివిధ వర్ణముల పూలతో పూజ చేసి జపము చేయవలెను. దర్భలతో, నెయ్యి కలిపిన ఉలవలతో హోమం. ఉలవలు దానము చేయవలెను.

**9) శుక్రుడు**

**మంత్రము: ఓం హ్రీం శుం శుక్రాయ నమః**

శుక్రయంత్రము గాని, వజ్రము గాని పెట్టి తెల్లని వస్త్రము ధరించి తెల్లని పూలతో పూజచేసి, జపము చేయవలెను. మేడి సమిధలతో, నెయ్యి కలిపిన అలచందలతో హోమం. అలచందలు దానము చేయవలెను.

**సూచనలు :**

1. గ్రహ దేవతలకు సంబంధించిన రత్నములు 300కేరెట్లకు తక్కువ కాకుండా ఉంటే మంచిది. లేని పక్షమున ఆ రంగు జాతిశిలను వాడవచ్చును. అది కూడా దొరకనిచో రాగిరేకుపై లేక కాగితముపై ఆ గ్రహదేవతా మంత్రమును గ్రహము యొక్క రంగు సిరాతో వ్రాసి పళ్ళెములో పెట్టి పూజించవచ్చును.
2. ప్రతిమంత్రము కనీసము లక్షచేసి అందులో పదవవంతు అనగా పదివేలు హోమము చేసి అందులో పదవవంతు పాలతో గాని, కొబ్బరినీళ్ళతో గాని తర్పణము చేయవలెను.
3) ఇది వరకే ఏదైనా ఇష్టదేవతా మంత్రపురశ్చరణ చేసిన వారు ఆ మంత్రముతో గ్రహమంత్రమును సంపుటి చేసుకొని జపము చేసిన త్వరగా ఫలితము లభించును.
4) కోరిన రంగు గల పూలు దొరకనిచో ఆ రంగు తెచ్చి గిన్నెలో నీళ్ళతో కలిపి ఇతర రంగు పూలతో ఈ రంగు నీళ్ళలో ముంచి పూజించవచ్చును. ఆ రంగు అక్షతలను పూజకు, హోమమునకు ఉపయోగించవచ్చును.

# నవగ్రహ ధ్యాన శ్లోకములు

నవగ్రహ స్తుతి

ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయచ
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః

సూర్య ధ్యానము

జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మి దివాకరం

చంద్రధ్యానము

దధి శంఖ తుషారాభం క్షీరార్ణవ సముద్భవం
నమామి శశినం సోమం శంభో ర్మకుట భూషణం

కుజ ధ్యానము

ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభం
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహం

బుధ ధ్యానము

ప్రియంగు కళికాశ్యామం రూపేణా ప్రతిమంబుధం
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహం

గురు ధ్యానము

దేవానాంచ ఋషీణాం చ గురుం కాంచన సన్నిభం
బుద్ధిభూతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిం

శుక్ర ధ్యానము

హిమకుంద మృణాళాభం దైత్యానం పరమంగురుం
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం

శని ధ్యానము

నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం
ఛాయా మార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరం

రాహు ధ్యానము

అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్య విమర్దనం
సింహికా గర్భసంభూతం తం రాహుం ప్రణమామ్యహం

**కేతు ధ్యానము**

**పలాశపుష్ప సంకాశం తారకా ద్యుతి మస్తకం**
**రౌద్రం రౌద్రాంతకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం**
**ఇతి వ్యాసముఖోద్గీతం యః పఠేత్ సుసమాహితః**
**దివావా యదివా రాత్రౌ విఘ్నశాంతి ర్భవిష్యతి**

వ్యాసమహర్షి చెప్పిన యీ నవగ్రహ స్తోత్రమును పగలుగాని రాత్రిగాని శ్రద్ధతో చదువువారికి విఘ్నములు శాంతించును.

**శని నామావళి**

**"కోణస్థః పింగళో బభ్రుః కృష్ణో రౌద్రోంత కో యమః**
**సౌరి శ్శనైశ్చరోమందః పిప్పలాదేన సంస్తుతః"**
**ఏతాని దశనామాని యః పఠేత్ ప్రయత శ్శుచిః**
**శనైశ్చర కృతా పీడా న కదాచిత్ భవిష్యతి.**

ఈ పదిపేర్లను శుచియై పారాయణము చేసినచో శనిపీడ తొలగిపోవును.

**63. ఉచ్ఛిష్ట విద్యలు**

ఉచ్ఛిష్ట శబ్దానికి శిష్టత అనగా శౌచము, ఆచారము లేనిది అని అర్థము. ఈ విద్యలను అశుచిగా, అనాచారపద్ధతిలో సాధన చేయాలి. తాంబూలము గాని, ఏదైనా సుగంధ మధురపదార్థము గాని నములుతూ దిగంబరులై ఏకాంత ప్రదేశములో వీటికి సంబంధించిన మంత్రములను జపించాలి. శ్మశానంలో గాని, చితాభస్మధారణ చేసిగాని జపిస్తే వేగసిద్ధి కలుగుతుంది. వీటికి రాత్రులు ముఖ్యం.

**1) ఉచ్ఛిష్ట గణపతి :**

తెల్లజిల్లెడు లేక వేపతో చేసి విగ్రహమునకు పూజ చేసి జపించాలి. మంత్రం జపిస్తూ విగ్రహం మీద నీళ్ళు పుక్కిలించి ఉమ్మివేస్తూ సాధన చేయాలి. అందుకే ఆంధ్రదేశంలో ఎవరైనా ఎక్కువగా ఉమ్మి వేస్తూ ఉంటే వాడు ఉచ్ఛిష్టగణపతి చేస్తున్నట్లున్నాడు అంటారు. దీనిలో ఇంకా తీవ్రమైన పద్ధతి సాధకుడు తన మలమూత్రములతో శ్మశానభస్మం కలిపి గణపతి బొమ్మ చేసి ప్రాణప్రతిష్ఠ చేసి ధూప దీప నైవేద్యములు సమర్పించి జపంచేస్తే క్షుద్రవిద్యయై త్వరగా సిద్ధిస్తుంది. మరొక పద్ధతి – గణపతి బొమ్మ తెల్లజిల్లేడు లేక వేపతో చేసిన దానిని మద్యపాత్రలో ఉంచి జేనెడులోతు నేలలో పూడ్చి దానిపై పీటవేసి శవమును కప్పిన వస్త్రంపై గణపతి యంత్రం వేసి దానిపై నరకపాలము పెట్టి పూజించి జపం చేస్తే వేగసిద్ధి కలుగుతుందని తంత్ర గ్రంథాలలో చెప్పబడింది.

మంత్రములు : **1) హస్తి పిశాచి లిః లిః స్వాహా**
**2) హస్తి పిశాచి లిఖే స్వాహా**

**2) సుముఖి**

ఈ దేవత స్త్రీ దేవత – ఉచ్ఛిష్ట గణపతి వలెనే దీని సాధన కూడా చేయవచ్చు. పురశ్చరణ అయిన తర్వాత 11 మంది స్త్రీలను పూజించి చెరకురసం వారికి ఇస్తే దేవతకు సంతుష్టి కలుగుతుందని ఒక చోట చెప్పబడింది. దీనికి మలమూత్ర సాధన చెప్పబడలేదు.

మంత్రము : **ఉచ్ఛిష్ట చాండాలిని సుముఖిదేవి మహాపిశాచిని హ్రీం ఠః ఠఃఠః**

**3) ఉచ్ఛిష్ట మాతంగి :**

ఈ దేవతకు లఘుశ్యామల అనే పేరు కూడా ఉంది. ఈమె ధ్యానంలో ప్రత్యేకత ఉంది.

**శ్లో॥ స్మరేత్ ప్రథమ పుష్పిణీం అరుణబిందు శోణాంబరాం**
**గృహీత మధుపాత్రికాం మద విఘూర్ణ నేత్రోజ్వలాం**
**శయస్థ మణివల్లకీం విమల శంఖ తాటంకినీం**
**ఘనస్తన భరాలసాం గళితచూళికాం శ్యామలాం**

కొత్తగా మొదటిసారి రజస్వలయై ఆ నెత్తురు చుక్కలు అంటిన చీరతో చేతిలోని పాత్రలో ఉన్న మద్యం త్రాగుతూ మత్తుతో కన్నులు ఎర్రబడగా చేతిలో మణులు పొదిగిన వీణ వాయిస్తూ, చెవులకు శంఖాభరణములు ప్రకాశిస్తుండగా వక్షోజముల బరువుతో అలసయై, విరబోసిన జుట్టుతో విరాజిల్లే శ్యామలను స్మరిస్తున్నాను.

అన్నం తినేటప్పుడు చివర పెరుగు లేక మజ్జిగ లేక పాలు కలిపిన చిన్న అన్నపు ముద్ద మంత్రమును జపిస్తూ భోజన పాత్రలో వదలి వేయవలెను. దీనివలన వశీకరణశక్తి లభించును. **(ఉచ్ఛిష్టాన్నేన దినే దినే బలిందద్యాత్ పశ్యన్నేవవశం కరోతి)**

హోమమునకు రజస్వలా వస్త్రఖండములు వాడిన వేగసిద్ధి

మంత్రం : **ఐం నమ ఉచ్ఛిష్ట చాండాలి మాతంగి సర్వవశంకరి స్వాహా.**

4) **మంజుఘోష** : ఈమె అప్సరసలలో ఒకరు. అన్నం తింటూ ఈ మంత్రాన్ని జపిస్తూ చివరి ముద్ద కంచము లేక విస్తరిలో వదలివేయాలి. వశీకరణశక్తిని, సంగీతశక్తిని ఈ దేవత ప్రసాదిస్తుంది.

మంత్రం : **అ ర వ చ ల ఘోం**

64. **శాబరవిద్యలు - (వివిధ ప్రయోజనములకు)**

వేదశాస్త్రములు చదువలేనివారు, అడవులలో జీవించే అమాయకులు - ఇబ్బందులు పడకుండా ఆత్మరక్షణ, కార్యసిద్ధి - అనుగ్రహించటం కోసం పరమశివుడు కిరాతరూపం ధరించి ఆయా ప్రాంతీయ భాషలలో మంత్రముల నుపదేశించాడని అనుశ్రుతంగా వస్తున్న గాథ. వీటిలో కొన్ని సంస్కృతంలో ఉన్నవి ఉదా:

**1) శబరాణాం నమః అసమే కుసుమే స్వాహా (వశీకరణం)**

ఈ విద్యలు ఎక్కువ పురశ్చరణ లేకుండా హోమములు మొదలైన ప్రక్రియలు అవసరం లేకుండా సిద్ధిస్తవి. అయితే గురుపరంపరలో వచ్చినప్పుడు మాత్రమే అవి పనిచేస్తవి.

2) **నమః కృష్ణశబరాణాం వివిరిచలేచలే చిత్తే వివిరి రేతర్మోచే స్వాహా.** (వశ్యము, వీర్యస్తంభనము)

3) ముహిముహి పుహిపుహి స్వాహా (యోని ధ్యానము వశీకరణము)

**1) దుగ్ధ వర్ధక విధానము :**

మంత్రము : **ఓం దముందనీ శాహ దుగ్ధం కురు కురు స్వాహా"** శుభ ముహూర్తము నందు ఆవుకు ప్రదక్షిణము చేసి ఈ మంత్రమును 10 వేలు జపము చేయవలెను. దీపావళి నాడు కానీ ఏ అమావాస్యరోజు గాని చేసిన వేగముగా సిద్ధించును. సంతానవతులైన స్త్రీలకు వక్షోజములలో పాలు లేనపుడు ఈ మంత్రముతో మంత్రించిన పాలను తీర్థముగా ఇవ్వవలెను.

**2) నేత్రరోగ నివారణమునకు**

మంత్రము : **ఓం అంగాలీ, బంగాలీ అతాల్ పతాల్ గర్దమర్ద్**
**అదార్ కటార్ ఫట్ ఫట్ ఉట్ కట్ ఓం హుం హుం ఠఃఠః"**

శుభముహూర్తము నందు 10 వేలు జపము చేసి మామిడి లేక వేప సమిధలతో హోమము చేయవలెను. ఆదివారము నాడు కాని, మంగళవారము నాడు కానీ చేయుట ప్రశస్తము. హోమభస్మమును తిలకముగా ధరించిన వ్యాధి తగ్గును.

**3) మొలల (పైల్సు) వ్యాధి నివారణకు**

మంత్రము : **"ఓం ఛాయీ ఘూయీ ఛలక్ ఛలాయీ ఆహూమ్ ఆహూమ్**
**క్లం క్లాం క్లీం హూం"**

ఆదివారము గాని, మంగళవారము గానీ మొదలు పెట్టి 10 వేలు జపము చేయవలెను. దశాంశ హోమము చేయవలెను. మంత్రజలమును హోమభస్మమును

ఆసన రంధ్రమునకు పూయవలెను. మంత్రజలమును తీర్థముగా తీసుకొనుట, హోమ భస్మమును శిరసున ధరించుట కూడ చేయవలెను.

**4) స్ఫోటకము (అమ్మవారు), మారి (కలరా) నివారణకు**

ఎ) హ్రీం శ్రీం శీతలాయై నమః

ధ్యానం : **నమామి శీతలాం దేవీం రాసభస్థాం దిగంబరాం**
**మార్జనీ కలశోపేతాం శూర్పాలంకృత మస్తకాం**

దిగంబరయై చీపిరి, నీటిబిందె, చేట ధరించి గాడిదనెక్కి ఉండే శీతలాదేవిని స్మరించవలెను.

బి) శీతలా శాబర మంత్రము

మంత్రము : **ఓం ఫట్ ఫట్ భైరీ శీతలా, ఫేరత్ ఆవై హోథ్**
**ఓం శ్రీం శ్రీం శబ్ద సాంబా, పురోవాచా ॥**

గ్రహణసమయమున కానీ, దీపావళి నాడు కానీ నడుములోతు నీళ్ళలో నుంచొని కానీ లేక తడిగుడ్డలు కట్టుకొని గాని- ఈ మంత్రమును జపించవలెను. గ్రహణ సమయమైనచో పట్టు నుండి విడుపు వరకు చేసిన చాలును. ఇతర సమయములలో 10 వేలు జపము, దశాంశము హోమము చేయవలెను. దేవతకు పెరుగన్నము నైవేద్యము పెట్టవలెను. ఆది, మంగళ, శుక్రవారములలో కూడ జపసాధన ప్రారంభించవచ్చును. రోగికి మంత్రించి తీర్థమిచ్చుట గానీ, మంత్రజలముపైన జల్లుట గానీ మంత్రము మనసులో స్మరించుచు వేపమండతో దిగతుడుచుటగానీ చేయవలెను.

**5) ఎలుక కాటుక మంత్రము**

**"ఓం గేరిఠః"** - 10 వేలు జపము, దశాంశ హోమము. గ్రహణమునాడు గానీ, దీపావళి అమావాస్యనాడు గానీ సహస్రజపము. ఆది లేక మంగళవారములు మొదలు పెట్టవచ్చును. మంత్రజలమును తీర్థముగాను, హోమభస్మమును ధారణకు ఈయవలెను.

**6) చీమలు, క్రిమికీటకములు, కాళ్ళజెఱ్ఱి మొదలగునవి కుట్టినచో మంత్రము**

మంత్రము : **1) 'ఓం హ్రోం హ్రం ఓం స్వాహా, ఓం గరుడ సం హుం ఫట్'**
**2) ఓం నమో భగవతే విష్ణవే సర్ సర్ హన్‌హన్ హుం ఫట్‌స్వాహా**

ఆది లేక మంగళవారము మొదలు పెట్టి 10 వేల జపము, దశాంశ హోమముల మంత్ర తీర్థ స్వీకరణ, హోమభస్మధారణ, విషమును నివారించును.

**7) ఆకర్షణ మంత్రము :**

ఎ) తారిణీ విద్య : మంత్రం : **ఓం శ్రీం శ్రీం ఫట్**

దీపావళి నాడు గాని, గ్రహణము నాడు గానీ 11 వందల జపము, 108 హోమము ఆది మంగళవారములలో మొదలెట్టిన 10 వేలు జపము. దశాంశ హోమము.

బి) వశీకరణమునకు : మాతృకాశాబర మంత్రము

మంత్రము : **"ఓం నం నాం నిం నీం నుం నూం నేం నైం నోం నౌం నం నాం అముకం ఆకర్షయ హ్రీం స్వాహా"**

అముకం అన్నచోట వ్యక్తిపేరు పెట్టవలయును.

దీపావళి రాత్రి 1100 జపము చేసి 108 ఆహుతులలో హోమము చేయవలెను. ఆరు అంగుళాల మేడిపుల్ల తీసుకొని దానిపై ఎర్రమన్నుతో కోరిన వ్యక్తి పేరు వ్రాసి "7" సార్లు మంత్రించి ఆ వ్యక్తి యొక్క గృహములో గోడలో గాని, ఇంటి కప్పులో గాని ఉంచవలెను.

**8) తప్పిపోయిన లేక దూరముగా వెళ్ళిన మనిషి తిరిగి రావడానికి**

మంత్రము : **ఓం నమః ఆదిపురుషాయ అముకం ఆకర్షణం కురుకురు స్వాహా**

గోరోచనము, నల్లఉమ్మెత్త రసము కలిపి గన్నేరు పుల్లతో 'భూర్జపత్రము' మీద ఈ మంత్రమును వ్రాయవలెను. 'అముకం' అన్నచోట ఆ వ్యక్తి పేరు లిఖించవలెను. ఈ మంత్రమును ఒక మాల అనగా 108 జపము చేసి గన్నేరు పుల్లను వెలిగించి, దానిలో ఈ భూర్జపత్రమును కాల్చవలెను. '3' లేక '5' ఆది లేక మంగళవారములలో ఈ సాధన చేసినచో వ్యక్తి తిరిగి వచ్చును. మంత్ర పురశ్చరణ 10 వేలు దశాంశ హోమము. ఉమ్మెత్త లేక గన్నేరు సమిధలతో లేక పూలతో హోమము.

**9) నేత్రదోష నివారణ మంత్రం (కంటిలోని పువ్వు పోవుటకు)**

మంత్రము :"ఓం హుజార్ జ్వాలా ఉజ్జైహర్ ధః ధః"

మంత్ర పురశ్చరణ 10వేలు, దశాంశహోమము ఆదివారము లేక మంగళవార ఉదయము రోగిని ఎదురుగా కూర్చుండ బెట్టుకొని 22 సార్లు మంత్రము చదువుతూ చాకుతో అడ్డముగా నేలమీద గీతలు గీయవలెను. 21 రోజులు ఈ విధముగా చేసిన వ్యాధి శమించును.

**10) అజీర్ణ నివారణకు**

మంత్రము : **"అగస్త్యం కుంభకర్ణంచ శమంచ బడబాలనమ్**
**ఆహార పరిణామార్థం స్మరామి చ వృకోదరం"**

10వేలు జపము, దశాంశము అన్నముతో హోమము. అన్నము తినగానే

మంత్రమును మూడుసార్లు స్మరించవలెను. కడుపులో నొప్పి వచ్చినప్పుడు మంత్రించిన జలము త్రాగవలెను.

**11)వాయుగోళ (గ్యాస్ట్రిక్ ట్రబుల్) నాశక మంత్రము**

మంత్రము : **ఓం నమో కాళీ కంకాళినీ నదీపార్ బసే ఇస్మాయిల్ జోగీ, లోహేకా కఘౌటా కాటి కాటి లోహేకా గోలా కాటి కాటి హో శబ్ద సాంబా, పురో మంత్ర ఈశ్వరో వాచా**

10 వేల జపము, మిరియాలతో సొంఠి, వాము, జీలకఱ్ఱల హోమము. మంగళ వారము నాడు రోగిని ఎదురుగా కూర్చో పెట్టుకొని చాకుతో అతని పొట్టను తాకి 21 సార్లు మంత్రము చెప్పుచూ నేలమీద అడ్డదిడ్డముగా గీతలు గీయవలెను. ఈ విధముగా '7' రోజులు చేసినచో వ్యాధి తగ్గును.

**12) జ్వర నివారణకు**

మంత్రము : **"ఓం భైరవ భూతనాయే వికరాళకాయే అగ్నివర్ణాధాయే సర్వజ్వర బంధ మోఘయ త్ర్యయంబకేతి హుం"**

10 వేలు జపము, దశాంశహోమము ఆదివారము లేక మంగళవారము స్నానము చేసి సహదేవీ మొక్క దగ్గరకు వెళ్ళి దాని మూలికా గ్రహణ విధానము ప్రకారము తీసి మౌనముగా తన స్థానమునకు రావలెను. అది పట్టుకొని జపము చేసి ఆ మూలికలో ఒక ముక్కను తీసి జ్వరగ్రస్తుని చేతికి కట్టినచో ఎటువంటి జ్వరమైనను తగ్గును.

**13) ఆత్మరక్షణకు నరసింహ శాబరము**

ఎ) ఓం భుగభుగ నారసింహ కట్టుకట్టు వొడలుకట్టు భుగభుగ నారసింహ దిశలుకట్టు ఓం అఘోరనారసింహ పరమంత్రముల కట్టు, ఓం జ్వాలానారసింహ పర యంత్రముల కట్టు, ఓం దుష్ట ప్రతిపాతక నారసింహ మమ శత్రువులను కట్టు, ఓం లక్ష్మీనారసింహ శత్రువాక్కులను కట్టు, ఓం క్షాం క్షీం క్షూం శత్రుబలంబులను కట్టు, క్షౌం క్షః పరవుచ్చాటన భేదనంబులను కట్టు కట్టు, కొట్టు కొట్టు, వుచ్చాడు, వుచ్చాడు హుంఫట్ స్వాహా.

బి) దిగ్బంధనము – ఆత్మరక్షణకు

**అరుముగుత్రోని పోత్రే వేషము గుత్రోని పోత్రే వినాయకుని పోత్రే నెత్తి ముఖం కపాలయం ఈశ్వరుని కావల్ రెండు భుజములు చక్రం కావల్ వీడదుకై హనుమాన్ కావల్ వలదుకై భైరవుడు కావల్ నా దేహమంతయు నారాయణ స్వామి కావల్ ఇందు పేయిం పిశాచీయుల బంధబంధాగి ఓం హర హర జరముని వాయుముని రుద్రకాటేరి పొగదూలు స్వాహా.**

**14) చర్మరోగ నివారణకు శాబరవిద్య**

శుక్రవారము నాడు 9 రావి ఆకులు తెచ్చి ఒక పళ్ళెంలో పరిచి ఆకులపై శివలింగములు లేక రుద్రాక్షలు పెట్టి పళ్ళెం ఇవతల 9 నూనె దీపములు వెలిగించవలెను. రుద్రాక్షమాలతో ఈ క్రింది మంత్రము జపించవలెను.

మంత్రము : **ఓం నమో ఆదేశ్ గురుకో - త్రిలోచన్ దేవికో అంజనికో మహా సాబరికో (అముక) రోగికో ఠీక్ కరె - చర్మరోగ మిటావె - రక్తశుద్ధ కరేజో నకరేతో - భగవతి చింతామణికో త్రిశూల్ భావే.**

దీపముల ముందు కూర్చొని ఒక మాల జపం చేసి శివలింగములపై నీరు వేయలెను. 3 మాలలు జపము ఆ విధముగా ప్రతిమాల జపం తరువాత నీరువేస్తూ పూర్తి చేయవలెను. పిదప ఆ లింగములను దాచుకొని రావి ఆకులను పారవేయవలెను. ఆ నీటిని తీర్థముగా కొంచెము తాగి మిగిలిన నీరు శరీరమునకు రాసుకోవలెను. ఈ విధముగా 9 రోజులు చేయవలెను. ప్రతిరోజు రావి ఆకులు ఫ్రెష్‌గా మార్చవలెను. అనగా కొత్తవి పెట్టి జపం చేయవలెను. చర్మసంబంధమైన అన్ని రోగములను ఇది తప్పక నయం చేస్తుంది.

**అముక :** అన్నచోట రోగి పేరు చెప్పవలెను. స్వంతంగా చేసుకొనేటప్పుడు మమ అంటే చాలును.

## 65. క్షుద్ర ప్రయోగములు - బాధానివారణములు

1. **ఎఱ్రమారిక తంతు:**

   మారి, ఎఱ్రమారి, కుడియెడమ, ఛూంగులి, శిరస్సు, బిందు,నాభి బందు, ఉత్తరం దక్షిణం, తూర్పు బందు యిర్లిం శింరంటం రట్ కోడల్ కోడల్ దేవతల మారి దొంగచూపుల కారి శక్తి -పొమ్మంటే పో, రమ్మంటే రా, జయం అపజయం వుచ్చాటనం -5 రేకులు కలిగిన మందార పుష్పము, 9 రేకులు మయూరక పుష్పము, తొమ్మిది తమలపాకులు ఒకటిన్నర వక్కపేడు, నాలుగు ఒక్క చోట యెఱ్రని అక్షంతలు చేసి ముగ్గుమీద వేస్తే కోక విడుచును. తెల్లని అక్షతలు వేస్తే స్వస్థమగును. పంచెవన్నెల ముగ్గు వేసి మంత్రము పునష్టించి, అట్లువేసిన కాడ ఉపయోగించేది.

2. **గ్రామదేవత :**

   **ఓం నమో భగవతి ఏకవీరే శత్రు సంహారకారిణి అముకం శత్రుం స్ఫోట యుతం కురుకురు మాంసం ఖాహి ఖాహి స్వాహా.** దీనికి 3,000 జపము.

3. **మరొకటి శత్రునాశనము :**

**ఓం శివే శివశక్తి మహిశక్తి మహేశ్వరశక్తి నశిమశి. 8 రోజులు జపం.** శక్తిరూపమగు బొమ్మ వేసి శత్రువు పేరు, ఇంటిపేరు వ్రాసి బొమ్మ గర్భ మందుంచి 108 సార్లు చేస్తూ ధూప దీప నైవేద్యములు జరిగించి చాకలి బల్ల క్రింద పెట్టిన శత్రువునకు మరణం.

4. **బుడ్డ దింపుట**

నిమ్మకాయ, దారం తెచ్చి శ్మశాన వస్త్రాన కట్టి బట్టను కట్టి నిమ్మకాయ మీద వాని పేరు వ్రాసి మంత్రించిన మన్ను పైపూత పూసి, పుట్టకోమలో దిగ విడచిన బుడ్డ దిగును. యెరెస్తె స్వస్తం.

దీనికి మంత్రం:

**ఓం జాగ్రు కొల్లాపురం పట్టి రను భంజనము చ్చం చ్చం చ్చం చ్చం చ్చం వుజని పుట్టం దేవి గురుపాదమాన ఓం గురుప్రసాదమాన ॥**

5. **నక్క తంతు**

నక్కయెముక కపిత్థాన నూరి నర కపాలమున పూసి తామరనూలు వత్తిచేసి కర్రిఆవు నేతితో ఈశ్వరగృహ మందు కాటుక పట్టి అభిమంత్రించి కన్నులకు పెట్టి నీలిచీర గట్టి ఎంతదూరము పోయినా కానలేరు.

**అదృశ్యహోదీం హపదితయో దూపవర్తనం కురు కురు స్వాహా॥**

6. **మోళికి**

**ఓం శ్రీదుర్గాదేవి, పసలెతుజె, ఓకాయె, మారంతె, మారంతె, నోమార్తె, నోమారు కాహరాజ్ఞ - లక్షకు సిద్ధి.**

ఏడు మందారపువ్వులు తొలుచూలి కోడిపుంజు, కన్నెగుడ్డు మనిషి పుర్రెలో అన్నము వండి, పచ్చని ఎర్రని నల్లని తెలుపు. ఈ నాల్గురంగులు ముద్దలు చేసి యుంచి 108 సార్లు జపించిన తర్వాత పై వస్తువులను ధూపదీపములతో నైవైద్యం చెల్లించవలెను.

7. **రాజపూజితమునకు**

**ఓం నమో భగవతి లలితాంగి భూషణి త్రిభువన తిలకి సర్వజనవశీకరి హ్రీం హ్రీం హుం ఫట్ స్వాహా॥** నిత్యము 109 సార్లు జపిస్తూ ఉద్ధరిణెడు నీరు ధార విడుచు చుండవలెను.

8. వాకట్టు - భైరవి

**అం కట్టు ఊం కట్టు ఊం పట్టుకట్టు వింగ్ వంగ్ అట్టు, భైరవపాదమాన పట్టు కట్టు స్వాహా ॥** 108 మార్లు మంత్రించి విభూతి శత్రునిపై చల్లిన వాక్కు బందగును.

**విడుపు :**

**ఓం శక్తి గణపతి, చండాలభైరవి నేను తలచినపుడె విడిచిపెట్టు పటుస్వాహా॥**
108 సార్లు విభూతి మంత్రించిశత్రునిపై చల్లిన వాక్కు వచ్చును.
నిత్యము స్వశక్తి కొద్ది జపించి సిద్ధి చేసి యుద్ధరిణెడు ఉదకం విడువవలెను.
జపసిద్ధి - 8వేలు.

9. **ఉగ్రభైరవి - ఓం నమో భగవతే ఉగ్ర భైరవాయ భూత ప్రేత పిశాచి నాశ చింతం భ్రమత స్వాహా॥**

నల్లకోడి రక్తముతో అక్షతలు చేసి శ్మశాన బూడిదలో ఈ అక్షతలు కలిపి ఆ శ్మశానములో కూర్చుని 3,000 జపించి ఆ అక్షతలు శత్రువు ఇంటిపై చల్లిన పిచ్చి యెత్తును. జపసిద్ధి - 35 వేలు

10. వారాహి -

**ఓం ధూమ్రవారాహి ధూం ధూం వారాహి ధూం ధూం ధూం శత్రుమారణి, ధూం శత్రుసంహారిణి ధూం ధూం ధూం శత్రునాశని ధూం ధూం శత్రుం వారాహి, హిడి, హిడి, డికం పటు స్వాహా॥**

ఉలవపిండి, కొర్రపిండి, మినపపిండి, శత్రువు కాలికిందిమట్టి యీ నాలుగు కలిపి ఆడబొమ్మను చేసి ఆ బొమ్మ ఛాతీమీద యంత్రము వ్రాసి 22 ముళ్ళు తెచ్చి ముల్లు ఒకటికి 22 మార్లు మంత్రించి బొమ్మ యొక్క ప్రతికీలుకు గ్రుచ్చి కొత్త పిడతలో ఈ బొమ్మను ఉంచి పైన ప్రమిదను బోర్లించి శ్మశాన భూమిలో పాతిపెట్టిన యెడల శత్రువు మృతి పొందును.

ద వా

ద ఠి ఠిభ డ

లా ఇం రా రా

బా ధ

పాతినది మంగళవారం నాడు రాత్రి ధూప, దీప నైవేద్యములలో తీయవలెను.

॥ఖేం॥దం॥

11. ఉచ్ఛిష్ట గణపతి
ఓం హ్రాం శ్రీం క్లీం రం లం లం లం ఓం నమో ఉచ్ఛిష్టగణపతయే నమః హ్రీం హ్రీం ఫం ఫం భం భం రగారక్తం ఓం చండాలదేవతాయై నమో నమః నాకు చెప్పిన గురువు భృగుపాదమాన ఓం నమో నమః ॥ జపసిద్ధి 2000

| | | |
|---|---|---|
| | రాం | |
| హ్రాం | ఓం | హ్రాం |
| | శ్రీం | |

యంత్రమునకు ధూపదీపములతో, కుంకుమ, పచ్చని పూలతో పూజచేసి మద్యమాంసములు నివేదన చేయవలెను. (రోజు 109)

12. ప్రయోగ నివారణ
ఓం యం రం లం శం షం ఓం ఫట్ స్వాహా
108 సార్లు మంత్రించి విభూతి కలిపిన ఉదకం లోపలకు ఇచ్చిన ఎటువంటి ప్రయోగమైనా తిరుగును.

13. కాళి
శినుంగళ శవీర శక్తుకవీర శరభదుర్గి భయకరి నీల ప్రాముల నక్షత్ర దురిగి కాళికాదేవి మనుళ మళియాళ భగవతి, భగవతి, డిప్ప, గురు, సమవస్తు నిలగురు, పఠి, పఠి, ధర ధన్ ధన్ ధన్ సంగ్రామ శుంభ మళియాళ దురిగి భగవతీ నీ పాదమాన తప్పురాదు సద్గురుపాదమాన నీలకంఠీయపాదమాన- జపసిద్ధి 1000. శత్రువు అల్పాచమానము చేసిన స్థలమున మట్టిని తీసి ఉండగా చేసి మూడు పర్యాయములు మంత్రించి ఇనుప మేకుతో ఆ ఉండను బంధించి యింటిపేరుతో సహా మూడు పర్యాయములుపై మంత్రమును జపించిన శత్రువుకు మూత్రబంధనము. నిత్యము శక్త్యనుసారము జపించి సిద్ధిచేసి ఉద్ధరిణెడు ఉదకధార విడువవలెను.

14. గోసాయి చట్కా
పడమరగా పారిన ఉసిరిక చెట్టు వేరు ఉదయకాలమున తెచ్చి అంకోల తైలముతో నూరి పాదములకు పూసుకొని ఎంత దూరము నడిచినను శ్రమ ఉండదు.

15. **అదృశ్యము**

వస అంకోల తైలముతో ఏడు రోజులు నూరి త్రిలోహగుటకలో ఉంచి ఆ గుటక నోటియందు వేసుకొన్న యెడల అదృశ్యమగును.

16. **అదృశ్యము**

తెల్ల ఆవాలు అంకోల తైలముతో నూరి త్రిలోహగుటకలో ఉంచి ఆ గుటక నోటి యందు వేసుకొన్న యెడల అదృశ్యమగును.

17. తాళకము, నల్లగేదె పాలు, సమభాగముగా కలిపి అంకోల తైలముతో నూరి శరీరమునకు పూసుకొన్న యెడల అదృశ్యమగుదురు.

18. తెల్లవాకుడు వేరు తెచ్చి ధూపదీప నైవేద్యము చెల్లించి మొలను కట్టుకున్న యెడల చోర భయము లేదు.

19. **చాముండి**

**ఓం నమో భగవతి చాముండి జ్వర జ్వర వశమానయ హ్రీం హ్రీం హూంఫట్ స్వాహా॥**

నిత్యము శక్తి కొద్ది జపించి యంత్రమును ధూప దీపములతో తెలకపిండి, మునగ కూర, అనపపప్పు, కుంభము, బూరెలు, కోడి, నైవేద్యము చెల్లించవలెను. సంవత్సరమునకు ఒక మారు యంత్రముతో సహా జపించి ధూపదీపముల నైవేద్యము చెల్లించవలెను.

20. ఈ క్రింది యంత్రములు వరిపిండిలో వేసి కొబ్బరికాయ సహా కలశముంచి దక్షిణపు వైపు కొబ్బరినూనె జ్యోతి ఉంచవలెను.

1) శిశువులు దక్కుదురు, గర్భము నిల్చును

| |
|---|
| బం పాం కం శ్రీం |
| ధవ ధాతా యక్షజ |
| టుదుక్తో సురాః |

2) పగవారు ఉపకారు లగుదురు.

| | |
|---|---|
| హ్రీం | హ్రీం |
| హ్రీం | హ్రీం |

3) శీతజ్వరము మానును

| | | |
|---|---|---|
| క్లో | | క్లో |
| | శ్రీ | |
| క్లో | | క్లో |

4) రాజ వశ్యము

| | |
|---|---|
| హ్రీన్ | నః |
| హ్రీన్ | రాః |

5) పులి పారిపోవును

| | | | |
|---|---|---|---|
| 5 | 12 | 2 | 7 |
| 6 | 3 | 9 | 8 |
| 11 | 6 | 8 | 1 |
| 4 | 5 | 7 | 10 |

6) గ్రహములు పోవుటకు

| | | | |
|---|---|---|---|
| హోం | క్షం | క్షోం | ము |
| క్ష | | క్ష | |
| నా | క్షం | క్షిం | హం |

7) అంటుదోషములు హరించును

| | | |
|---|---|---|
| ఓం | అ | హ |
| వ | స | వ |
| | ళ | |

8) పాము భయము పోవును.

| | | | |
|---|---|---|---|
| హ్రీ | | హ్రీ | హ్రీ |
| హ్రీ | దే | వ | యెహ్రీ |
| హ్రీ | హ్రీ | హ్రీ | హ్రీ |
| హ్రీ | హ్రీ | హ్రీ | హ్రీ |

9) గ్రహములు విడచుటకు

ఓం ఓం ఓం ఓం ఓం

అం అం అం అం అం

హ్రీం హ్రీం హ్రీం హ్రీం హ్రీం

క్షం క్షం క్షం క్షం క్షం

వం వం వం వం వం

10) పగవాని గెల్తురు




11) పాలు త్రాగని పిల్లలు పాలు త్రాగుటకు




12) పీడలు హరించును




13) గ్రహదోషములు పోవుటకు

హ్రాం హ్రాం హ్రాం హ్రాం

సం సం సం సం

కం కం కం కం

గం గం గం గం

14) పెనిమిటి భార్యలను సఖ్యపరచుటకు




21. **స్త్రీ వశ్యము :**

కణపకాయ శొంఠి సమభాగములుగా కలిపి నూరి ఆత్మజలములో కలిపి లోపలకు ఇచ్చిన యెడల స్త్రీ వశ్యమగును.

22. **గారడి**

3 నిమ్మపండ్లు, ఒక దబ్బపండు వీటి రసం తీసి దూదికి పట్టించి యెండబెట్టి ఆ దూదిని చీరలలో పెట్టిన చీర కాలిపోవును. తిరిగి ఆ చీరను నీటిలో తడిపిన ఎప్పటివలె నుండును.

23. **కడియం తంతు**

రాత్రికాలమందు చుక్కపడే సమయమున అత్తి యిగ్రి మాపేలా, కేళా, ఆవ్, అరశు – ఈ ఆరు మానుపేర్లు జపిస్తూ చుక్క దిగక పూర్వమే ఒక రాయి చేతి

యందుంచుకొని, తెల్లవారిన తరువాత ఒక తటాకము వద్ద కూర్చుని మీన కొత్తి అనే గువ్వముక్కు ఎర్రగా ఉండును. దేహము నెమలి రంగుగా ఉండును. ఆ గువ్వ చేపను పట్టుకొనే నిమిత్తం నీటిపైన ఎగురుతూ వుండి తటాలున నీటియందు దుముకును. ఆసమయమున చేతిలో ఉన్నరాయి కాలిక్రింద వేసితొక్కిన యెడల ఆ గువ్వ తిరుగ ఎగురుకుండ నీటియందే పడి యుండును. అప్పుడు మరియొకరి చేత ఆ గువ్వను తెప్పించి పారుతూ ఉన్న నీటి యొడ్డున కూర్చొని ఆ గువ్వ యొక్క ప్రతి వెండ్రుక ఆ నీటి యందు వేసిన యెడల అందులో ఒక వెంట్రుక నీటికి ఎదురు వచ్చును. ఆ వెంద్రుకను పట్టి తీసి వెండితో గాని, రాగితో గాని కడియము చేయించి ఆ వెంద్రుకను ఈ కడియములో ఉంచి చేతికి ఉంచుకొని స్త్రీ ధరించిన చీరవైపు చూస్తూ కడియం పైకెత్తిన యెడల చీరపైకి లేచును. క్రిందకు తీసిన యెడల క్రిందకు జారును. మయలగల స్త్రీ ధరించిన వస్త్రమునకు ఉపయోగించకూడదు.

24. **నల్లికట్ల పాము తంతు**

రొండుతోకలు ఉన్నటువంటి నల్లికళ్ళపాము యొక్క తోక మొదటికి త్రుంచి ఆ తోక రెండుగా చీల్చి ఆ రెండు బద్దలు రెండు భరిణలలో ఉంచి, ఒక భరిణెలో ఒక రూపాయిని, రెండో భరిణెలో అర్ధరూపాయిని ఉంచి మూతవేసి, ఒక తటాకము గట్టున 40 రోజులు పూడ్చి యుంచిన తరువాత రూపాయి అర్ధరూపాయిలో వచ్చి చేరునో లేక అర్ధరూపాయి రూపాయిలో వచ్చి చేరునోవచ్చి చేరియున్న సొమ్మును చేతియందుంచుకొని నిలచియున్న సొమ్మును జాగ్రత్తగా ఉంచి, చేరిన సొమ్మును ఖర్చు పెట్టిన యెడల నిలచిన సొమ్ము వద్దకు చేరును.

25. **జడవేసే మంత్రము**

ఓం జారి జారీమాలినే, రాకాశపురవాయీ ఓంకారస్వరూపిణి, నారదోపదేశ ధనుర్వేద మధ్యాన, పరమరహస్య, సకలదేవతా రక్షణే, ఓం భగ భగ, ధగ ధగ, రాం రీం రూం, రం రం రం, ప్రళయదుర్గే నదురే గురుభక్తుని కడుదు, పిరుదు భీముని కట్టు, నడుము నాగేంద్రుని కట్టు, శిరస్సు పాతాల పరమేశ్వరుని కట్టు, లలాటం హనుమంతుని కట్టు, కట్టు చూచి కడకుపోతే కాలభైరవుని ఖండించి, వీరభద్రుని విరిచికట్టి, పరభద్రుని పరశిగొడ్డలి చేత బంధింతు శక్తి దేవతలు పురుషదేవతలు అన, భూమండలం తిరిగినా నా కట్టు తిరగరాదు,

ఇదే గృహకట్టు, మైలకట్టు, యింట్లో ఉన్న శిశుబాల కట్టు, కాలభైరవుని కట్టు, ఊరు నాలుగు వీధుల కట్టు, గ్రహాన్ని కట్టు, గ్రహం పట్టిన మనిషిని కట్టు, కాశీవిశ్వనాధుని కట్టు, త్రిలోచన త్రిపురమర్దనీ ఆన తప్పినా, అడుగుతప్పినా హరిహర బ్రహ్మాదులాన, నా యాన, నాకు చెప్పిన గురువు పాదమాన, హుం ఫట్టు ఫట్టు స్వాహా ॥ ఓం రం రం రం రం రం రం భేతాళమహారాజు పాదమాన ద్రాం ద్రీం ద్రూం హుం స్వాహా॥

26. గోవృద్ధి - **94 యంత్రము**

| | | | |
|---|---|---|---|
| 8 | 1 | 77 | 10 |
| 11 | 74 | 4 | 5 |
| 2 | 7 | 9 | 76 |
| 73 | 12 | 6 | 3 |

27. **చూలు నిలుచుటకు (84)**

| | | | |
|---|---|---|---|
| 8 | 1 | 65 | 10 |
| 11 | 64 | 4 | 5 |
| 2 | 7 | 9 | 66 |
| 63 | 12 | 6 | 3 |

28. రాజవశ్యము - 64

| | | | |
|---|---|---|---|
| 8 | 1 | 45 | 10 |
| 11 | 44 | 4 | 5 |
| 2 | 7 | 9 | 46 |
| 43 | 12 | 6 | 3 |

29. వెర్రి కుదురుటకు - 52

| | | | |
|---|---|---|---|
| 18 | 25 | 2 | 7 |
| 6 | 3 | 22 | 21 |
| 24 | 19 | 8 | 1 |
| 4 | 5 | 20 | 23 |

30. నీళ్ళాడుటకు 34

| | | | |
|---|---|---|---|
| 9 | 16 | 2 | 7 |
| 6 | 3 | 13 | 12 |
| 15 | 10 | 8 | 1 |
| 4 | 5 | 11 | 14 |

31. జయము - 62

| | | | |
|---|---|---|---|
| 23 | 30 | 2 | 7 |
| 6 | 3 | 27 | 26 |
| 29 | 24 | 8 | 1 |
| 4 | 5 | 25 | 28 |

32. నాగసర్పము కరవకుండుటకు-44

| | | | |
|---|---|---|---|
| 8 | 1 | 25 | 10 |
| 11 | 24 | 4 | 5 |
| 2 | 7 | 9 | 26 |
| 23 | 12 | 6 | 3 |

33. ముట్టుకాని వారగుటకు-32

| | | | |
|---|---|---|---|
| 8 | 15 | 2 | 7 |
| 6 | 3 | 12 | 11 |
| 14 | 9 | 8 | 1 |
| 4 | 5 | 10 | 13 |

34. గ్రహములు విడచుటకు -54

| | | | |
|---|---|---|---|
| 19 | 26 | 2 | 7 |
| 6 | 3 | 23 | 22 |
| 25 | 20 | 8 | 1 |
| 4 | 5 | 21 | 24 |

35. రోగం మానుటకు -42

| | | | |
|---|---|---|---|
| 13 | 20 | 2 | 7 |
| 6 | 3 | 17 | 16 |
| 19 | 14 | 8 | 1 |
| 4 | 5 | 15 | 18 |

36. భార్య వలచుటకు -24

| | | | |
|---|---|---|---|
| 4 | 11 | 2 | 7 |
| 6 | 3 | 8 | 7 |
| 10 | 5 | 8 | 1 |
| 4 | 5 | 6 | 9 |

37. ఐశ్వర్యమునకు - 22

| | | | |
|---|---|---|---|
| 3 | 10 | 2 | 7 |
| 6 | 3 | 7 | 6 |
| 9 | 4 | 8 | 1 |
| 4 | 5 | 5 | 8 |

38. బాలగ్రహములకు

| | | |
|---|---|---|
| 6 | 1 | 8 |
| 7 | 5 | 3 |
| 2 | 9 | 4 |

39. గ్రహ నివారణకు



40. శూన్య గ్రహములు పాటు గ్రహములకు

| | | | |
|---|---|---|---|
| 9 | 16 | 5 | 4 |
| 7 | 2 | 11 | 14 |
| 12 | 13 | 8 | 1 |
| 6 | 3 | 10 | 15 |

41. **సభ కట్టు మంత్రము**

ఓం నమో భగవతే ఊరికి ఉత్తరాన పొలిమేర కట్టుదు. ఊరు కట్టుదు. ఊరు. వాకిలి కట్టుదు. రచ్చకట్టుదు. రచ్చవాణ్ణి కట్టుదు చూచేకళ్ళు చూడకుండా

కట్టుదు. ఆడే నాలుక ఆడకుండా కట్టుదు. మింటను వచ్చే దయ్యాన్ని మింటనే కట్టుదు. కాట్లో దయ్యాన్ని కాట్లోనే కట్టుదు. అడవిలో చోర్లను ఆణఆణకట్టుదు. మృగాలకట్టుదు. అడవి జంతు సమూహాలన్నీ కట్టుదు నాగలింగ మాసుక్రింద నవకోటి సిద్ధుల కట్టుదు. యీ మంత్రాన మంత్రించిన విభూతి నుదుట ధరించినట్లయితే నా పగవాడి నాలుక ఆడకుండా నిలుచు ఓం గురుప్రసాదం ॥224 జపం॥

42. **మళయాళ హనుమంతుడు**

ఓం నమో భగవతే మళయాళ వీరహనుమంతా పెళ పెళ నాదమరు పెళా నాదమరు, శీఘ్రం వీరహనుమంతా, పెళపెళ దుష్టగ్రహాన్ ఖేం ఖేం రం మారయమారయ హుం ఫట్ స్వాహా॥

43. **కొండదేవత – పంచపాండవులు**

కట్టు – వాసారి మిందారి, యంత్రాల మందారి అంటూరి మిందారి, వుండూరు మిందారి నీరుకు మింద యిల్లవర – తూర్పునకు తిరిగి పసుపు అక్షింతలు పాతిపెట్టి, పడమర ముఖముగా వెళ్ళేది.

విప్పు : యిటు కీలు మందారి, నారూగు మిందారి మడియాల భూపతి – ఎర్రని అక్షంతలు మనిషి మీద దిగదుడిచి పంపవలెను.

44. **మారణం**

**అదే మహంకాళిశక్తి శాంభవీ త్రిపురసుందరీ గంగాభవానీ రక్తకాటేరీ, వాటుకాటేరీ పిల్లల కాటేరీ, యేటు కాటేరి నలుగురు అప్పాచెల్లెళ్లు కూడి అర్థరాత్రి వేళ చతుర్మధ్యాహ్నం రావే పోవే ... గోత్రం... నామం మమ శత్రుం మారణం కురుకురు పగవాని పట్టి గుండెలు ప్రేగు రక్తం ఆరగించరావే పట్టుపట్టు** 101 సార్లు జపించి నవధాన్యములు పిండితో శక్తి ప్రతిమ చేసి గాజులు బొట్టు ఉంచి కొత్తకుండలో ఉంచి పాతిపెట్టి శత్రువు యింటి దగ్గరకు వేవరియంత్త ప్యాలాలు చల్లి 101 పువ్వు పూజచేసి శత్రువు యిల్లు చూపిన తక్షణం చంపును. కీలుకీలుకు ముళ్ళుకొట్టి చెరువుగట్టున పాతిపెట్టేది.

45. **మనుష్యస్తంభనము**

రజస్వల స్త్రీ యొక్క వస్త్రము తెచ్చి గోరోజనము తెచ్చి శత్రువు పేరిట ఒక కుండలో వేసిన యెడల శత్రు స్తంభన మగును.

46. **నౌకా స్తంభనము**

అయిదంగుళముల పొడవుగల పాలకర్రను కొయ్యకింద చేసి ఏదైనా ఓడమధ్య వేసిన ఆ ఓడనిలచిపోవును.

47. **బుద్ధి స్తంభనము :**

గురుపిండి చెట్టువేరు, ఉత్తరేణి వేరు రెండున్ను ఇనుపపాత్రలో మర్దించి లలాట మందు తిలకము పెట్టుకుంటే ఎవరు సమీపమునకు పోయినను వారి బుద్ధి చెడిపోవును.

48. **ఆకర్షణకు :**

**ఓం నమో ఆది పురుషాయ అముకాకర్షణం కురుకురు స్వాహా॥**

నల్ల ఉమ్మెత్తాకు రసం, గోరోచనము, కలిపి గన్నేరు పుడకతో భూర్జపత్రమందు అముక అన్నచోట పేరుతో మంత్రము వ్రాసిన శతయోజనముల దూర మందున్న వాడైనను వశుడగును.

49. **తీవ్రాకర్షణ :**

అనామిక వ్రేలి రక్తము ద్వారా భూర్జపత్రమందు లిఖించి తేనెయందు వేసి యుంచిన స్త్రీలుగాని, పురుషులు గాని ఆతురతతో వత్తురు.

50. **నెత్తురు కక్కుట :**




ఆడమనిషి గాని, మగమనిషి గాని, పగవాడు అయిన పక్షమున, వాళ్ళ అల్పాచమానములో యీ యంత్రమును వేసి మధ్య టేకు ముల్లు గుచ్చి 100 సార్లు నశి నశి అని అంటే అతని నోటి నుండి యితరము నుండి రక్తము పడును. ముల్లు తీసి యంత్రము చెరిపి మశిమశి అని 100 సార్లు జపిస్తే స్వస్థత కలుగును.

51. **మరణము :**

**ఓం నమో సుగంధ పరిమళ శరీరిణి సంగీత విద్యా శుష్వాల్లాసిని భ్రమరాంబికే నారాయణస్వరూపిణి నిన్ను నమ్మితిగదె భగవతి ఆం క్రోం హ్రీం ఆ ఆ ఆ మమ శత్రూన్ వాతవాసజ్వరాన్ మారణం కురుకురు శీఘ్రం మళయాళశక్తి యం యం రం రం నామధేయం ఖేం ఖేం మారణం కురుకురు హుంఫట్ స్వాహా॥** చితాభస్మముతో త్రివర్తులాకారపు ముగ్గు వేసి వెయ్యి జపం చేస్తే 32 అమడల్లోగా ఎక్కడ ఉన్నా చచ్చును. (నామధేయం –అన్నచోట పేరుతో జపించాలి)

52. రక్తస్రావ మరణం

అం రం క్రోం యం హ్రీం మళయాళశక్తి మహా వీరప్రతాపి మహా సుందరరూపి నీ కోపతాపంబులు చూపి నా శత్రువు దేహంబు జొచ్చి వేవేగ రక్తంబు వస్త్రంబులు విడజిమ్మవే ! తల్లీ ! రక్తకాటేరీ ! కావులు దొబ్బలు గుండెలు పగుల కావించవే ఆదిశక్తి కొల్లాపురి అంకా రారా అవు అవు చెలో చెలో శీఘ్రం శీఘ్రం యం యం యం యం యం ఖేం ఖేం ఖేం ఖేం ఖేం ఘీం ఘీం ఘీం ఘీం ఘీం హూంఫట్. 3000 జపంచేసి చితాభస్మము శత్రువు పేరుపై రాసి యీ మంత్రము 28 సార్లు చదువుతూ జిల్లేడుపాలు ఆ పేరుమీద చల్లేది శత్రువుకు రక్తంస్రవించి నిమిష నిమిషమునకు బట్టలు విడుచును. పారిపోవును. కొన్ని దినములకు చచ్చును.

52. ఉచ్చాటన :

ఓం నమో భగవతి శత్రుశాపరి శ్మశానభస్మధారి ఛిందిఛింది ఛిందిఛింది ఘేం ఘేం హ్రీం హ్రీం హ్రీం గచ్ఛ గచ్ఛ అమూన్ శత్రూన్ దహ దహ చకి చకి హుంఫట్ స్వాహా॥ (అమూన్ అన్నచోట పేరు వ్రాయాలి)

కంచు పాత్రలో చాటపేడు ఎముక వేసి శత్రువు పేరు వ్రాసి పై మంత్రము వెయ్యి జపించిన శత్రువు మతిలేనివాడై పారిపోవును.

54. మంటల ప్రయోగము :

ఓం నమో భగవతి సిద్ధేశ్వరి అమృతపాణి ఆనందవల్లి ఆగమకరి అమృత చాపకరి మమ సకలేప్సితాన్ సిద్ధిం కురు కురు మం మం మం ఓం ఓం ఓం శం శం శం శీఘ్రం హుంఫట్ స్వాహా ॥ 10,000 జపం చేస్తే దేవత ప్రత్యక్షమగును. పిమ్మట నదిలో యిసుక తెచ్చి ముగ్గువేసి శత్రువు పేరు వ్రాసి జిల్లేడు పాలు పోసి 108 సార్లు జపిస్తే శత్రువు శరీరమంతటా మంట లెక్కి నాలుగైదు రోజులలో కట్టుకున్న గుడ్డలు తగులబడును. ఆ మనిషి ఏ యింట్లో ఉన్న ఆ యింట్లో వారికి మతిస్థిరముండదు.

55. పాముల వాని బుర్ర కట్టుటకు:

ఓం శ్రీం క్లీం ఠం ఠం నిన్నే నెరనమ్మితినే ఎర్రమారి కొల్లాపురిశక్తి నాకు తోడు నీడై నా పంపు సిద్ధిశాయవే తల్లీ భగవతి నీకు వారవారంబులు పశువుల నైవేద్యములు చేతుగదే భగవతీ సౌం సౌం హుంఫట్ స్వాహా॥ 1000కి సిద్ధి తరువాత కోడిగుడ్డు సొన, ఆవు పంచితముకలిపి సభాస్థానమున చల్లగా కట్టు నిల్చును.

**కట్టు విప్పుటకు :** వేపాకు రసము కుంకుమ కలిపి **"ఓం నమో భగవతే సర్వజనరక్షణాయ॥** అని మంత్రించి చల్లితే కట్టు విడుచును.

56. శత్రు ప్రయోగము తగులకుండుటకు

**ఓం అదివేశ దూరుపాతాళ నా వూరు సాహుకోట రహు కోటిహనుమంత అవు అవు పాతుపాతు హుంఫట్ స్వాహా స్వాహా ॥** అని గంగ సిందూరము 28 సార్లు మంత్రించి తిలకము పెట్టుకుంటే ఎదుటివారు చేసిన ప్రయోగము మనపైకి రాదు. వచ్చినా తిలకము నల్లబడి పోవును. శరీరముకష్టపెట్టదు.

57. పార్శ్వ నొప్పి పొవుటకు

**యోకాపి, యోచాపి, యోయి అల్లా బ్బప్రాకరో** – అని

యివి కాగితం మీద వ్రాసి బల్లమీద పెట్టి నెప్పి ఉన్న మనిషిని యెదుట కూర్చోబెట్టి మరొక మనిషిని నొప్పి ఉన్న చోట పట్టుకోమని మంత్రము 3సార్లు యీ అక్షరాల మీద మంత్రించి ఒక మేకు ఒక అక్షరములో కొడితే సగము బాగగును. అలాగునే మూడక్షరాల మీద మూడు మేకులు కొడితే తక్షణం పూర్తిగా బాగగును.

58. సభకట్టు

**ఓం హ్రీం శ్రీం అం క్రోం హ్రీం వషట్ దుర్గి సర్వజన సమ్మోహనం కురు కురు దేవి మహమ్మాయి అం ఈం క్రోం హ్రీం సౌః హుంఫట్** – 3000 సిద్ధి. నిమ్మకాయంత వెన్నతో రోజు నివేదన 1000 చొప్పున 3 రోజులు జపం సభామధ్యమున 108 సార్లు మంత్రించిన అక్షతలు పాతిపెట్టవలెను. తరువాత సభకు వెళ్ళవలెను.

59. యక్షిణీవిద్య – గుప్త మారు సాధనము

**ఓం బాబు గుప్తా బిరో బ్రం హ్వాం కరపుత్రో దేవతం కోకాజోర్ శెయిదు పెకొరివు ముహలో ముండవే ఆశీవు బాయె బుమూజేయి కిపెశీచి తటికి జివు జదినోజివు బ్రంహ్వాంక్కు ద్రోహో వర్జీవు ॥**

శని లేక ఆదివారం శ్మశాన మృత్తిక (భస్మము) తెచ్చి సారాతో కలిపి బొమ్మ చేసి 'గుప్తా బీరు' అని పేరు పెట్టి ముసిని కర్రపీటపై కూర్చోబెట్టాలి. గంధము వ్రాయాలి. పంచవన్నెల ముగ్గు వేసి ముగ్గుపై బొమ్మ వుంచి మద్య మాంస నివేదన చేసి 21 రోజులు రోజుకు 1000 చొప్పున మర్రిచెట్టు క్రింద గాని

గదిలో గాని రాత్రులు జపము చేసిన దేవత ప్రసన్నుయగును. నల్లకోడి బలి యియ్యవలెను. కోరిన పని చేయును. యీ బొమ్మ పెట్టెలో పెట్టి ఆడవాళ్ళు ముట్టకుండా ఉంచి వారం వారం ధూపదీప నైవేద్యములు చేయవలెను. మంత్రం చదివిన పూలు మిఠాయి వచ్చును. నాగసరం బందగును. ప్రతిరోజు జపానంతరం భోజనం.



60. ఇచ్ఛాసిద్ధి

ఒక గుమ్మము ఉన్న ఆవుసాలలో ఒక మూల అలికి శని లేక ఆదివారం ఉపవాసముండి మద్యమాంస నివేదన చేసి రోజుకు 1000 సార్లు చొప్పున వందారబీరు నాకు సహాయం కావలెను అని ఏడురోజులు జపించిన దేవత వశమగును. (పైవలెనే క్రియ)

61. బాధాసృష్టి నివారణ

ఓం సర్వప్రతిపరం సంస్మృస్య సస్వరః - మంత్రం

1) ఇది చీటిపై వ్రాసి గ్రహావిష్టుని చెంగున కట్టిన బాధ కుదురును.
2) ఇది 12సార్లు మినుగులు మంత్రించి పైనవేసిన బాధ కలుగును.
3) దీనితో 15 సార్లు గంగ సింధూరం మంత్రించి నెత్తిమీద వేస్తే శూలం గ్రుచ్చినట్లు ఉండును. ఏడ్చును.
4) షట్కోణ యంత్రము వేసి కోణముల యందు 2 బీజముల చొప్పున వ్రాసేది. యంత్రముపై గ్రహావిష్టుని కూర్చుండబెట్టి మంత్రించిన గ్రహము పలుకును.
5) దీనిని తమలపాకుపై వ్రాసి దంతం క్రింద ఉంచుకొని మంత్రించేది.
6) ఈ ఆకు ఎడమవైపున ఉంచుకుంటే ప్రయోగాలు రావు - సరి.

62. గ్రహాకర్షణ : వష్మన్ విశాదాం మ్మః

1) యీ మంత్రముచే విభూతిమంత్రించి బొట్టు పెట్టిన 2 గడియలలో ఎక్కడి గ్రహమైనా వచ్చును.
2) దీనితో కుంకుమ 9 సార్లు మంత్రించి శిరస్సుపై వేసి ఎడమవైపు జడవేసిన స్తంభనమగును.

63. ధ్వజ ప్రయోగము

గురు నమః బ్రహ్మాద్వారా సమావిష్ణు విష్ణో లోకేశమావృతం

అరుణంశ్యామరక్తా బాధ్యతికోటి సమావృతం అని ధ్యానించి ధ్వజాకారముగా

వ్రాసి దాని మొదట శత్రువు పేరువ్రాసి యీటె అలుగు సాంబ్రాణి ధూపము వేసి శత్రువు పేరు మీద ఆ అలుగు నిలిపి దానికి మంత్రంః ఘింకారో మహా ర రవికుతార మహాదగ్ని ధూమె, ధూమం ముఖం కంఠం హృదయం నాభి కటి పాదం ప్రాణనిఘని ఘోరనింద్రియ పతనం నిమగ్ని స్వాహా। ఆ అలుగు వాని పేరు మీద దిగగొట్టేది. శత్రువు పోతూ పోతూ బోర్లపడి ప్రాణం విడుచును. వాయిదా సిద్ధం అవును. (జపశుద్ధి 108)

64. పాషాణ ప్రయోగం : **(జపశుద్ధి 108)**

**హలాహలముఖ ఓంకారరూపిణి దశానంద భైరవి మహాలక్ష్మీశ్వరీ శివా భవాని మునికిన్నెరె రేయిక మహామ్మాయి వూరమారి, చెన్నులమారి, భూతమారి రాం క్లీం క్షోం హుం ఫట్ స్వాహా.** యిందుకు క్రమము ఆది వారం నాడు కుమ్మరి ఆవములో బూడిదయును శ్మశానములో బూడిదయును చాకిరేవు పొయ్యిలో బూడిదయును యీ మూడు నీళ్లలో కలిపి పై వ్రాసిన మంత్రముతో మూడు నాలుగు మాట్లు మంత్రించి శత్రువు యింటిమీద చల్లిన గ్రహములు రాళ్ళు వేయును. పై మంత్రముతో అక్షతలు మంత్రించిన నిలచిపోవును.

65. నారికేళ ప్రయోగము

తాంత్రిక ప్రయోగము : త్రినేత్ర ఫల సంయుక్తం శత్రుపాద విధూళకం తత్ర ఉచ్ఛిష్ట సంయుక్తం నామ గోత్ర విధాయకైః॥ కాళనంది జితేత్యుక్తే సంగ్రహం ఫలసమ్మితం నేత్రేణ దాపితం ప్రోక్తం ఉచ్ఛిష్టంతు త్రివాచకం జపేన స్థాపితం రాత్రౌ నవరాత్రాణి పూజనం। శత్రు మృత్యుభయం యుక్తం శత్రు రోగవిదారణం మారణం సప్తవింశత్యాయితి తాంత్రిక లక్షణం

మంత్రం॥ **ఓం నమో త్రినేత్ర ఫలధారుణి జగన్మోహిని శక్తి రుద్రశక్తి శ్రీం క్లీం సౌః మమ శత్రూ న్నాశయ నాశయ॥**

66. వృశ్చిక ప్రయోగం

**హరిః ఓం క్లీం వీం విష్ణు బందుఈశ్వరుని బందు జలబందు మలబందు హం ఓం క్లీం హుంఫట్ స్వాహా ॥** క్రమము : వంటిగా ఉండే బుడ్డ ముల్లులో రసం సిందూరం శత్రువుని జలమలం యెట్టిపగడి పువ్వులోపెట్టి మూతికి బిరడా పెట్టి పై మంత్రము సప్తవారము మంత్రించి శత్రువు మూత్రంపోసే స్థలములో బొరికలో పెట్టేది.

67. **జలతంతు జలప్రయోగం**

క్రియంతు – మినిపపిండి, వలికిలో విభూతి, ఆవములో విభూతి, చాకలిపొయిలో విభూతి యీ నాల్గు దినుసులు కలిపి ప్రతిమను చేసి మూడురోజులు ఆత్మ జలం పోసి నీటి గుడ్డ కట్టి నీళ్ళలో విడవపలయును.

మంత్రము॥**రుద్రమళయాళ భగవతి స్వాహా** 107 శుద్ధి 12 రోజులు వాయిదా.

68. **క్రియతంతు**

ఆదివారము నాడు ఉదయము కాకమునుపే స్నానము చేసి ఉత్తరేణి చెట్టును స్నానము చేయించి సాంబ్రాణి ధూపం మూడు నిమ్మకాయలు బెల్లం నైవేద్యం యిచ్చి కర్పూరం వెలిగించి జానెడులోతు త్రవ్వి ముందరి వేరును వెంద్రుకల దారముతో బిగించి శత్రువు పేరు చీటి వ్రాసి కట్టేది. యీ ప్రకారము చేస్తే అఘోరమైన రొమ్ము పోటున్ను నడుము పోటున్ను కలుగును.

మం॥ **ఓ.యి. రక్తిక నమస్తే** అని నాలుగు సార్లు మంత్రించి తిరిగి చూడకుండ వచ్చేది. **ఉపశమనం :** మన్ను త్రొవ్వి సాంబ్రాణి, కర్పూరం, టెంకాయలు నైవేద్యం యిచ్చి అటుకు నూలు బాగా త్రిప్పేది. మన్ను తీసివేసేది.

69. **క్రియ**

ఆదివారము నాడు అశ్వత్థ చెట్టుమీద యుండే వాయసము గూదు తెచ్చి ఆ రోజే గద్దగూడును శ్మశానములో కాలిమిగిలిన కట్టెలను తెచ్చి యీ మూడు సమానంగా చేసి వూరు వెలుపల కాల్చి భస్మము చేసి ఆ భస్మము తెచ్చి శత్రువుని యింటిమీద చల్లితే మూడురోజులలో మరణం తప్పదు గురువాజ్ఞ.

70. **ఉచ్ఛిష్ట చాండాలి ప్రయోగం :**

ఉచ్ఛిష్ట చాండాలీ స్తోత్ర మహామంత్రస్య భేతాళఋషిః ఉచ్ఛిష్ట చాండాలీదేవతా దుం బీజం గ్లౌం శక్తిః హుం కీలకం, మమ శత్రు విమోచనార్థే జపే వినియోగః ధూం శత్రు పలాయనార్థే అం॥ ధూం వాక్స్తంభనీయ తర్జనీ॥ ధూధూ శత్రుమారణార్థే మం॥రం శత్రు ధూమావతే ధూం ॥అనామ॥ రం శత్రు వాక్స్తంభనీ కనిష్ఠి ॥ ఖేం ఖేం ఖేం మమ శత్రూన్ శీఘ్రం శీఘ్రం ఖే ఖేః కరతల॥ లం లం లం లం లం ॥దిగ్బంధః॥

ధ్యానం : రం రం రం రం రక్తవీర్యం సకలగుణమయం దేవ దేవ దేవసఖి వం వం వం వాయువేగం సర్వశత్రు భక్షిణి హం హం హం హం అకారరూపం

సర్వశత్రు భక్షిణి । నం నం నం నం నగ్నరూపం సర్వశత్రుభక్షిణి స్వాహా ।
అటలతటలఘటిత ఘటోఘటానాం హుంఫట్ మారయమారయ ఫట్ మారయ మారయ మారయ హుంఫట్ స్వాహా॥
మినుములు, గోధుమలు ప్రేతభస్మము యీ మూడున్నూ కల్వపూలున్ను పల్లేరు ఉమ్మెత్త పూలు శత్రునామగోత్రములతో పూజ చేసి బొమ్మను శత్రువును యిల్లు కట్టిన తలాపు పెట్టి పూడ్చి మన్ను పోసేది. (తిప్పు)

71. **చోరవాగ్బంధనం :**

చచ్చిన పీనుగును ఎత్తుకొని శ్మశానమునకు పోవు మార్గమధ్యమున శవమును దించి వంటకు బియ్యము గాని, అన్నము కాని నాల్గుదిక్కులు పెట్టుదురు. మూడవ దిక్కున పెట్టిన బియ్యము కాని అన్నము కాని తెచ్చి వండించి కరాటాన పెట్టి దోవన ప్రయాణము చేయునపుడు రొండిన చెక్కుకొనిపోతే చోరభయము లేదు.

72. **రక్త ప్రయోగము(పాశుపతము)**

ఓం నమో భగవతే పురాణావల్లభాయ విషోర్కమతరంగీ ఆ వనకోటి బ్రహ్మాండ రోమ కోదండ అఖిల ప్రతాపస్వామి నీ హస్తంబు ధరించిన అగ్ని కలాప చక్రంబు యే దైత్యులపై ప్రయోగించిన నీ వుగ్ర చక్రంబు అతల వితల సుతలంబు రసాతల పాతాళంబు వుదర ఖండించి మర్దించి అండాండ దండ దనుజుల గుండెలు చెండాడి కొంకిన ఘోటకాశక్తుల శరభ శాకిని ఢాకిని కూష్మాండ రాక్షస దుష్ట దానవుల హతాహతంబు చేసుకొని హం చక్రమూర్తి దినం నమో నారాయణ నారీ నాం నాం నీం రం రం రం యం యం యం నం నం నం ఖేం ఖేం ఖేం హుం ఫట్ స్వాహా॥ విధానం: ఆదివారం అమావాస్య కాని గ్రహణ కాలమందు కాని పై మంత్రము 108 సార్లు శుద్ధి చేసుకొనేది. ఆమీద కార్యము కావలసినప్పుడు 28 సార్లు మంత్రించి యెర్రని అక్షతలు మంత్రించి శత్రువు మీద చల్లితే నోట రక్తము పడి చచ్చును.

73. **బృహత్తు ప్రయోగము**

**ఓం హ్రీం క్లీం హ్రైం అముకాలేశం పరతంత్ర రూపిణీం హ్రీం విధు దేవదత్త హుంఫట్ స్వాహా.** యీ మంత్రం 18 సార్లు మంత్రించి శత్రువుపై విభూతివేస్తే శత్రువునకు చేరు బిగించి బుద్దదిగును. **తిరుగుకరాళి కామాక్షికాభగన్ నివేశయ నివేశయ హ్రీం శ్రీం క్లీం ఫట్ స్వాహా** ఎగిరిపోవును. (108) శుద్ధి

74. **దిష్టిమంత్రము**

హరిః ఓం మళయాళభగవతీ గ్రక్కున కదలివచ్చి కోభవీకోభవీ చాలకుంటే, ఎడమచేతి రక్తం ఆహారం యిత్తును వూరికి ఉత్తరాన వల్లకాడు, వల్లకాడులో మర్రి, మర్రి క్రింద జిల్లెడు, జిల్లెడు క్రింద దయ్యము, దయ్యము చంకన పిల్ల, పిల్ల చంకన జోలె, జోలెలో విభూతి, మంత్రించి బొట్టు పెట్టుకుంటే దిష్టి జ్వరాలు విడుచును. నాకు చెప్పిన గురుపాద మాన.

75. **సర్పతంత్రు ప్రయోగములకు**

గోధుమపిండితో ఆదివారం ఒకటిన్నర జానెడు ప్రమాణముగల సర్పమును చేసి దానిని పసుపుతో పూసి పడిగకు యెర్రపూల రసము కాని కుంకుమగాని పూసి దాని ప్రక్కన రెండు నిమ్మపండ్లు మంత్రించి పెట్టి ప్రాణ ప్రతిష్ఠ చేయవలెను.

ప్రాణప్రతిష్ఠ మంత్రము: **ఓం ఉరగాయ ప్రాణాయ స్వాహా**

**ఓం సర్పాయ ప్రాణాయ స్వాహా**

**ఓం నాగేంద్రాయ ప్రాణాయ స్వాహా**

యిది 118 సార్లు మంత్రించవలెను. యిందుకు మూలమంత్రం: **ఓం నమో భగవతే అకాలమృత్యు స్వరూపిణి అం ఓం చండికేశ్వరీ అకాలమృత్యుస్వరూపిణి ఓం సర్పరాజేంద్రాయ అకాలమృత్యుస్వరూపిణి** – దీనిని 108సార్లు ఆదివారం శుద్ధిచేసి మంత్రించి శత్రువుని పేరు చీటి వ్రాసి పాముకు కట్టి ఉచ్చాటయ ఉచ్చాటయ అని 12 సార్లు మంత్రించి నీళ్ళు చల్లిన అది మృత్యు స్వరూపమయి శత్రువును కరచి చంపును. దీనిని పచ్చనైన చెట్లలో పారవేయవలెను. దీనిని రాత్రి మొదటి జాము మొదట చేయవలయును.

76. **శిల్పతంతు :**

ఒక తెల్లరాయిని తెచ్చి బెస్తవారము నాడు కాని, ఆదివారము నాడు కాని, 110సార్లు ఈక్రింది మంత్రముచే మంత్రించి విసరి శత్రువు యింటిమీద పారవేయవలయును.

**ఓం పర్వతరాజాయ స్వాహా**

**ఓం భయంకరాయ స్వాహా**

**ఓం యమ దూతాయ స్వాహా**

తిర్గు – **ఉచ్చాటయ ఉచ్చాటయ స్వాహా** అని వేసిన రాయిని తీసివేయవలయును.

77. **ఆవేశ యంత్రములు.**

| | |
|---|---|
| ఓం | హ్రీం |
| ఓం<br>హ్రీం | హ్రీం<br>ఆం |




## 66. వివిధ దేవతా మంత్రములు

**సూచన :** మంత్రశాస్త్ర గ్రంథములలో కొన్నివేల మంత్రములు వివిధ సంప్రదాయములకు సంబంధించినవి ఇవ్వబడి ఉన్నవి. మహామంత్రములు ఏ ప్రయోజనమునకైనను పనికివచ్చును. కొన్ని నిర్దిష్టమైన ప్రయోజనములకు మాత్రమే పనికివచ్చును. ఏ మంత్రమైన శాస్త్రములో చెప్పబడిన సంఖ్య పూర్తి చేసినపుడు మాత్రమే మంత్రము మీద అధికారము లభిస్తుంది. జపము, హోమము మొదలైన అయిదు భాగములతో కూడిన పురశ్చరణ పూర్తి చేసి మంత్రము మీద అధికారము పొంది అప్పుడు ప్రయోజనము కొరకు జప హోమాది ప్రయోగములు చేయవలెను. మంత్రము మొదలు పెట్టిన రోజునుండే కోరికలు కోరడం శాస్త్ర సమ్మతము కాదు. లోకములో చాలా మంది రోజుకు మేము 108 సార్లు చేస్తున్నాము. మా పనులు ఏమీ కావడం లేదు. ఈ దేవతకు శక్తి లేదు. ఇంకేదైనా మంత్రం చెప్పండి అంటుంటారు. పురశ్చరణలు చేయకుండా ఫలితాలు ఆశించడం పొరపాటు. ఆ తరువాత కూడ కార్యసిద్ధికి మరల జప హోమములు చేయాలి. మొదటి పురశ్చరణ పూర్తయిన తరువాత హోమ ప్రయోగము తర్పణ ప్రయోగము సరాసరి చేయవచ్చు. ఈ విధముగా శాస్త్ర పద్ధతులు తెలుసుకుని కార్యసిద్ధిని సాధించాలి. ఒక మహామంత్రము అనుష్ఠానము చేసి అధికారము పొందితే మిగిలిన మంత్రములు కొద్ది జపముతోనే సిద్ధించగలవు. కాళీమంత్రసిద్ధిని పొందిన తరువాత రామకృష్ణపరమహంస వివిధ దేవతా మంత్రములను ఒక్క మాల అనగా 108 సార్లు చేయగనే ఆ దేవత సాక్షాత్కరించేదట.

మంత్రశాస్త్రంలో మరొక సంప్రదాయం కూడా ఉంది. ఒక మంత్ర పురశ్చరణ చేసిన సాధకుడు మరొక మంత్రాన్ని చేయాలనుకున్నపుడు తాను చేసిన మంత్రముతో కొత్త మంత్రమును సంపుటి చేసి జపము చేస్తే తొందరగా సిద్ధిస్తుంది. లలితా సహస్రనామ వ్యాఖ్యాత భాస్కరరాయలవారు తమ వ్యాఖ్యలో ఈ సంపుటీకరణ పద్ధతిని విశదీకరించారు.

ఉదాహరణకు ఒక వ్యక్తి గం గణపతయే నమః అనుమంత్రం పురశ్చరణ చేశాడనుకోండి. అతడు సూర్యమంత్రం చేయాలనుకుంటే 'ఓం గం గణపతయే సూర్యాయ నమః' అని సంపుటీకరణము చేసి జపము చేయవచ్చును. అయితే ఈ కలయికలో సాత్విక విద్యలను రాజస, తామస విద్యలతో కలపరాదన్నది గుర్తుంచుకోవాలి.

ఈ విభాగంలో పరిమిత ప్రయోజనములు కల దేవతా మంత్రములు కొన్ని, మహావిద్యలు కొన్ని ఇవ్వబడుచున్నవి. ఇంతకు ముందు చెప్పబడిన సమస్యలకు అక్కడ సూచించిన మంత్రములే కాక ఈ పటలములో ఇవ్వబడిన వాటిని కూడా ఉపయోగించు కొనవచ్చును. కాళీ, తార మొదలైన పెద్ద దేవతలకు చాలా మంత్రములు ఉన్నవి. వానిలో కొన్ని మాత్రమే ఇక్కడ ఇవ్వబడుచున్నవి.

1. గణేశమంత్రములు

**1) గం గణపతయే నమః**

**2) ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనంమే వశమానయ స్వాహా (మహాగణపతి)**

**3) లక్ష్మీగణపతి : 1) శ్రీం గ్లౌం శ్రీం వరవరద శ్రీ లక్ష్మీగణపతయే నమః**
**2) ఓం శ్రీం గం సౌమ్యాయ గణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా**

**4) త్రైలోక్య మోహన గణపతి : వక్రతుండ ఏకదంష్ట్రాయ క్లీం హ్రీం శ్రీం గం గణపతయే వరవరద సర్వజనంమే వశమానయ స్వాహా.**

**5) హరిద్రా గణపతి : ఓం హుం గం గ్లౌం హరిద్రాగణపతయే వరవరద సర్వజన హృదయం స్తంభయ స్తంభయ స్వాహా.**

**6) శక్తి గణపతి : ఓం హ్రీం గ్రీం హ్రీం**

**7) మేధాగణపతి : మేధోల్కాయ స్వాహా**

**8) గణపతి షడక్షరి : వక్రతుండాయ హుం**

**9) కుక్షిగణపతి : ఓం హుం గ్లం కుక్షిగణపతయే నమః**

**విభీతక ఫలకము మీద గైరికశిలతో యంత్రము వేసి పూజించిన శత్రు స్తంభనము జరుగును.**

**10) ఉచ్ఛిష్ట గణపతి మంత్రములు : 1) హస్తి పిశాచి లిఃలిః స్వాహా**
**2)హస్తి పిశాచి లిఖే స్వాహా**

**3) ఓం నమ ఉచ్ఛిష్ట గణేశాయ హస్తి పిశాచి లిఖే స్వాహా**

**4) ఓం నమో భగవతే ఏక దంష్ట్రాయ హస్తిముఖాయ లంబోదరాయ ఉచ్ఛిష్ట మహాత్మనే ఆం క్రోం హ్రీం గం ఘే ఘే స్వాహా**

ఉచ్ఛిష్ట గణపతి మంత్రములకు తెల్లజిల్లేడుతో కాని వేపతోకాని, బొటన వేలంత గణపతి బొమ్మ చేసి పూజించి దిగంబరుడయి తాంబూలము నములుచూ జపము చేయవలెను. బహుళ పక్ష అష్టమి నుండి అమావాస్య వరకు పురశ్చరణ సమయము.

విద్యాగణపతి – ఐం గం గణపతయే నమః

2. **కాళీ మంత్రములు**

1) **దక్షిణకాళి :** క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం హూం హూం దక్షిణ కాళికే క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం హూం హూం స్వాహా.

2) **మహాకాళి :** క్రీం క్రీం క్రీం హూం హూం దక్షిణ కాళికే క్రీం క్రీం క్రీం హూం హూం స్వాహా.

3) **భద్రకాళి :** భద్రకాళి మహాకాళి కిలి కిలి ఫట్ స్వాహా.

4) **కాళి :** 1) క్రీం కాళికే స్వాహా
2) క్రీం హ్రీం హూం కాళికే స్వాహా.
3) ఓం హ్రౌం కాళి మహాకాళి కిలి కిలి ఫట్ స్వాహా.

5) **స్వప్న కాళి :** ఓం హ్రీం క్లీం కలిం మహాకాళి కిలికిలి ఫట్ స్వాహా.

6) **శ్యామకాళి :** ఓం క్లీం శ్యామ కాళికే స్వాహా.

7) **చంద్రకాళి :** ఓం హ్రీం శ్రీం సః శ్మశానవాసిని చంద్రకాళి స్వాహా మానసిక శాంతికై వెన్నెలలో జపము చేయవలెను. చంద్రబింబములో కాళీదేవిని భావించి పాలుగాని, పాయసముకాని నైవేద్యము పెట్టవలెను.

8) **శ్మశానకాళి :** ఐం హ్రీం శ్రీం క్లీం శ్మశాన కాళికే క్లీం శ్రీం హ్రీం ఐం శ్మశానంలో కాని పంచకపాల ఆసనంపై కాని, చితాభస్మము ధరించి కాని జపము చేయవలెను.

9) **కలికుండ కాళి :** ఓం హ్రీం క్లీం కలికుండ మహాకాళి స్వామినే నమః దక్షిణముఖముగా కూర్చుండి ఆరులక్షలు జపము చేయవలెను.

3. **తారా మంత్రములు**

1) ఓం హ్రీం త్రీం హూంఫట్.

2) తారే తుతారే తోరే స్వాహా.

3) **నీలసరస్వతి :** ఓం హ్రీం త్రీం తారే నీలసరస్వతి స్వాహా.

4) **అంతరిక్షసరస్వతి :** ఐం హ్రీం అంతరిక్ష సరస్వతి స్వాహా.

5) **కిణితార :** ఐం హ్రైం హ్రీం కిణి కిణి విచ్చే

6) **చిత్రేశ్వరి తార :** క్లీం వద వద చిత్రేశ్వరి ఐం స్వాహా

**4. ఛిన్నమస్త :**

1) ఓం శ్రీం హ్రీం క్లీం ఐం వజ్రవైరోచనీయే హూం హూం ఫట్ స్వాహా

2) హూం వజ్రవైరోచనీయే ఫట్ స్వాహా

3) హూం

**5. భైరవి**

1) హసైం హసకరీం హసైం

**6. బగళాముఖి : (స్తంభన విద్య)**

1) హ్లీం బగళాముఖి స్వాహా

2) ఓం హ్లీం బగళాముఖి సర్వదుష్టానాం వాచం ముఖం పదం స్తంభయ జిహ్వాం కీలయ బుద్ధిం వినాశయ హ్లీం ఓం స్వాహా. లక్షజపము, పసుపుతో హోమము, పసుపుపచ్చని వస్తువులు నైవేద్యము (పులిహోర మొదలైనవి).

**7. లలిత :**

1) క ఏ ఈ ల హ్రీం హసకహలహ్రీం సకల హ్రీం శ్రీం
దీనిని షోడశి అందురు. శ్రీం లేకున్నచో పంచదశి అగును. లక్షజపము, ఎఱ్ఱని వస్తువులతో నైవేద్యం, హోమము.

2) ఐం హ్రీం శ్రీం క్లీం లలితాయై నమః

**8. భువనేశ్వరి :**

1) ఐం హ్రీం శ్రీం

2) శ్రీం హ్రీం క్లీం

3) హ్రీం

మూడు లక్షల జపము ఎఱ్ఱని వస్తువులతో పూజ, హోమములు

**9. మాతంగి :**

1) ఓం హ్రీం క్లీం హూం మాతంగ్యై ఫట్ స్వాహా

లక్ష జపము, తేనె, ఇప్పపువ్వు, బెల్లము మొదలగు మధుర వస్తువులతో హోమము.

**10. ధూమావతి : (ఉచ్చాటన విద్య)**

1) ధూం ధూం ధూమావతి స్వాహా

108 మిరియాలతో కాని, నల్లపూసలమాలతో కాని జపం ఒక లక్ష. కుంకుమ, నెయ్యి కలిపిన ఎర్ర అన్నము కాకికి రోజూ బలి వేయవలెను.

**11. కమలాత్మిక : (ఐశ్వర్య విద్య)**

1) ఐం జగత్ప్రసూత్యై స్వాహాః తామరగింజలమాలతో లక్షజపం, తామరపూలతో హోమం.

**12. శివమంత్రములు**

1) **పంచాక్షరి :** నమశ్శివాయ

2) **ప్రణవ పంచాక్షరి లేక షడక్షరి :** ఓం నమశ్శివాయ

3) **రుద్రమంత్రము :** ఓం నమో భగవతే రుద్రాయ

4) **క్రోధాగ్ని రుద్రమంత్రము :** ఓం క్రోధాగ్నే టక హటక హుం ఫట్ స్వాహా

5) **అఘోర రుద్రమంత్రము :** ఓం హ్రీం స్ఫుర స్ఫుర ప్రస్ఫుర ప్రస్ఫుర ఘోర ఘోర తర తనురూప తనురూప చట చట ప్రచట ప్రచట కహ కహ వమ వమ బంధ బంధ ఘాతయ ఘాతయ హుం ఫట్ స్వాహా.

6) పాశుపతము : ఓం శ్లీం పశు హుం ఫట్

7) శరభసాళ్వము : ఓం ఖేం ఖాం ఖట్ ఫట్ శత్రూన్ గ్రససి శత్రూన్ గ్రససి హుంఫట్ సర్వాస్త్ర సంహరణాయ శరభ సాళ్వాయ పక్షిరాజాయ హుంఫట్ స్వాహా.

8) **వీరభద్రుడు** – ఓం హ్రీం హూం వీరభద్రాయ నమః

9) **భైరవుడు :** 1) భం భైరవాయ నమః

10) **కాలభైరవుడు :** జూం హూం భం కాలభైరవాయ నమః

11) **మృత్యుంజయం :** ఓం జూం సః

**13. కుమారస్వామి మంత్రములు**

1) ఓం శరవణ భవాయ నమః

2) సౌం సుబ్రహ్మణ్యాయ నమః

3) ఓం వచద్భువే నమః

4) ఓం హ్రీం శరవణ భవ హ్రీం ఓం

5) ఓం శం శక్తిధరాయ శరవణ భవాయ షణ్ముఖాయ సుబ్రహ్మణ్యాయ సురాధ్యక్షాయ సుగతి దాయకాయ హ్రీం

13. ఎ) **అయ్యప్ప మంత్రము :** ఓం హూం శాస్తృ భైరవాయ నమః

14. **హనుమాన్ మంత్రములు**

1) ఓం హుం హనుమతే నమః
2) ఓం హ్రీం హరి మర్కట మర్కటాయ స్వాహా
3) **మళయాళ హనుమాన్ మంత్రము :** ఓం నమో భగవతే మళయాళ వీర హనుమంతా పెళ పెళ నాదమరు పెళానాదమరు శీఘ్రం వీర హనుమంతా పెళ పెళ దుష్టగ్రహాన్ ఖేం ఖేం రం మారయ మారయ హుం ఫట్ స్వాహా
4) **భైరవ హనుమాన్ మంత్రములు :**
   1) ఓం మనే హనుమంత సాక్షీన్వస్తే త్రస్తమంత్రవ భైరవస్యచ ఓం న్యా ఓం నమః తారఖరా అయ అథావః హరిశిని సర్వేషాం పాపీనాం దండ బంధనం కురుం కురుం స్వాహా
   2) ఓం ఓం జయ జయ నీలగిరి భైరవ బాణేశ్వర మహాదేవ భస్మనివని హనుమంత సాఖి వరస్తి అస్తి
   3) హుం భం హనుమద్భైరవాయ నమః

15. **వైష్ణవ మంత్రములు**

1) **నారాయణ మంత్రము :** ఓం నమో నారాయణాయ
2) **వాసుదేవ మంత్రము :** ఓం నమో భగవతే వాసుదేవాయ
3) **సుదర్శన మంత్రము :** సహస్రార హుం ఫట్
4) **కృష్ణమంత్రము :** 1) క్లీం కృష్ణాయ నమః 2) క్లీం కృష్ణ క్లీం
5) **నారసింహ మంత్రములు**
   1) ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్
   2) ఓం క్ష్రౌం నృసింహాయ నమః
   3) ఓం శ్రీం లక్ష్మీ నరసింహస్వామినే నమః
   4) పైన ఇవ్వబడిన ఉగ్రంవీరం - మంత్రములో 'భద్రం' అనే పదమునకు బదులుగా 'రుద్రం' అని మార్చి కొందరు శ్మశానము నందు జపింతురు. ఇది శ్మశాన నారసింహముగా పరిగణించ బడుతున్నది.

6) **గండ భేరుండ మంత్రము** 1) ఓం నమో భగవతే అష్టముఖ గండభేరుండ అఘోర పక్షి మహామారుత పక్షి రాజాయ శరభ సాళ్వ ప్రాణాపహారాయ సకల శత్రు సంహారకారణాయ మాం రక్ష రక్ష ఘ్రౌం ఫట్ స్వాహా.

2) ఘ్రౌం క్షౌం ఝ్రూం హ్సౌం హుం హ్రాం క్షిం ఫ్రోం హ్రీం నమః అష్ట ముఖ గండ భేరుండ నృసింహాయ మహా శరభాంతకాయ జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల సర్వశత్రూన్ ఛింది ఛింది భింది భింది హంది హంది హన హన ఖట్ ఫట్.

7) **రామమంత్రము :**

1) ఓం రాం రామాయ నమః

2) ఓం శ్రీం రాం రామాయ నమః

8) **పరశురామమంత్రం :** ఓం బ్రహ్మ క్షత్రాయ విద్మహే
(క్షత్రాంతకాయ) పాఠాంతరము
క్షత్రియాంతాయ ధీమహి తన్నో రామ ప్రచోదయాత్.

9) **వేంకటేశ్వర మంత్రం :** 1) ఓం నమో వేంకటేశాయ

**16. రాధాకృష్ణ మంత్రములు**

1) **రాధామంత్రము :** షడక్షరి – ఓం రాధాయై స్వాహా.
అష్టాక్షరి : ఓం హ్రీం శ్రీం రాధాయై స్వాహా.

2) **కృష్ణ మంత్రములు :** ఓం హ్రీం క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా.

**17. దత్తాత్రేయ మంత్రములు**

1) ఓం ఆం హ్రీం క్రోం ఏహి దత్తాత్రేయ స్వాహా

2) దం దత్తాత్రేయాయ నమః

3) ద్రాం దత్తాత్రేయాయ నమః

4) ఓం దత్తబ్రహ్మాత్మనే ఇష్టం దర్శయ దర్శయ హూం
(ఇది త్రికాల దర్శక మంత్రము)

**18. కార్తవీర్యార్జున మంత్రములు**

1) ఓం నమః కార్తవీర్యార్జునాయ మమ సర్వశత్రు చోర వ్యాఘ్రు వరాహాది సమస్త గ్రహ చోరాది హస్త పాదాది వక్త్ర సర్వాణ్యంగాని ఠ ఠ ఠ ఠ స్తంభయ స్తంభయ, బంధనం కురు కురుస్వాహా.

2) ఓం నమః కార్తవీర్యార్జునాయ శూర వీర ధీర ఘోర మహాబల పరాక్రమ శాలినే హుం ఫట్ స్వాహా.

దీప ప్రియః కార్తవీర్యః అని ఉండడం వల్ల దీపం వెలిగించి ఎదురుగా కూర్చుని మంత్రం చేయడం శీఘ్ర సిద్ధి దాయకం.

**19. బేతాళ మంత్రములు**

1) తురు తురు బేతాళాయ స్వాహా.

2) **భైరవ బేతాళమంత్రము :** భ్రాం భ్రీం భ్రూం భద్రభైరవాయ క్లాం క్లీం క్లూం వీర వేతాళాయ అదృశ్యం దృశ్యం కురు కురు స్వాహా (ఇది దివ్య దృష్టిని ప్రసాదించు విద్య)

3) **నాగబేతాళినీ మంత్రము :** ఓం నమో భగవతే రుద్రాయ మరాయ సిలి ధూమనే నాగబేతాళిని స్వాహా. ఇది నిధులను చూపించు విద్య.

**20. చండీ మంత్రములు**

1) ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే

2) ఓం చాముండే జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల స్వాహా.

3) ఓం శ్రీం రక్ష చాముండే తురు తురు అముకం మే వశమానయస్వాహా (వశీకరణ మంత్రము)

4) ఓం చాముండే హన హన దహ దహ పచ పచ అముకం గృహ్ణ గృహ్ణ స్వాహా (సంహార విద్య)

5) నమశ్చండికాయై (లక్షజపము, మిరియాలు ఆవాలతో దశాంశ హోమము)

**21. సరస్వతీ మంత్రములు :**

1) ఐం సరస్వత్యై నమః

2) ఐం క్లీం వదవద వాగ్దేవతే స్వాహా.

3) వద వద వాగ్వాదిని స్వాహా.

ఈ మంత్రములకు లక్ష జపము, సరస్వతీ ఆకులు పిప్పళ్ళు, వస, శొంఠి ద్రవ్యములతో హోమము చేయవలెను.

**22. లక్ష్మి మంత్రములు:**

1) శ్రీం

2) శ్రీం మహాలక్ష్మ్యై నమః

3) ఓం శ్రీం కమలే కమలాలయే ప్రసీదప్రసీద శ్రీం ఓం

108 తామర గింజలతో లక్షజపం, తామరపూలతో హోమం.

23. గౌరీ మంత్రములు :
హ్రీం గౌర్యై నమః అక్షర లక్ష జపం. నేతితో హోమం.

24. గాయత్రీ మంత్రములు

1) ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.
ఇది విశ్వామిత్రుడు దర్శించిన సౌరగాయత్రి

2) ఇంద్రగాయత్రి : వసిష్ఠుడు దర్శించినది

1) ఓం ఇంద్రో విశ్వస్య రాజతి
2) ఓం రాయస్కామో వజ్రహస్తం సుదక్షిణం పుత్రో న పితరం హువే
3) **కాళీ గాయత్రి :** మహాఘోరాయై విద్మహే, శ్మశాన వాసిన్యై ధీమహి తన్నఃకాళీ ప్రచోదయాత్.
4) **రాధాగాయత్రి :** ఓం వార్ష భానవ్యై విద్మహే
కృష్ణప్రియాయై ధీమహి, తన్నో రాధా ప్రచోదయాత్.

25. **ప్రత్యంగిరా మంత్రములు :**

1) ఓం హ్రీం యాః కల్పయంతి నోరయః క్రూరాం కృత్యాం వధూమివ తాం బ్రహ్మణాప నిర్ణుద్మః ప్రత్యక్కర్తార మృచ్ఛతు హ్రీం ఓం
2) క్షం హ్రాం హ్రీం భక్ష జ్వాలా జిహ్వే కరాళ దంష్ట్రే ప్రత్యంగిరే క్షం హ్రాం హ్రీం హుం ఫట్ స్వాహా.
3) క్షం హ్రాం క్రీం భక్ష జ్వాలా జిహ్వే కరాళ దంష్ట్రే ప్రత్యంగిరే భద్రకాళి క్షం హ్రాం క్రీం హుం ఫట్ స్వాహా

26. **వారాహీ మంత్రములు**

1) గ్లాం వారాహి స్వాహా
2) **ధూమ్రవారాహి :** ఓం ధూం ధూం మృత్యు ధూమే –
ధూం ధూం కాలధూమే ధూం ధూం ధూమ్రవారాహి హుం ఫట్స్వాహా.
3) **కిరాత వారాహి :** ఓం ఖేం ఖేం ఖం ఘ్రసీం అఘోర మృత్యుస్వరూపే ఖేం ఖేం ఖం ఘ్ర సూం కాలమృత్యుస్వరూపే ఖేం ఖేం ఖం ఘ్రసౌః రం రం కిరాతవారాహి హుం ఫట్ స్వాహా.
4) **స్వప్నవారాహి :** ఓం హ్రీం నమో వారాహి ఘోరే స్వప్నం ఠః ఠః – ఇది స్వప్న విద్యగనే కాక వశీకరణ విద్యగాకూడ పనిచేయును.
మిగిలిన పై వారాహి మంత్రములు శత్రుసంహార విద్యలు.

5) ఐం గ్లౌం రం రం రం హూం స్వాహా - ఎనిమిది లక్షల జపము, మారేడు దళం ఉసిరికాయలతో హోమము. శత్రునాశనము కల్గును.

**27. బాలా మంత్రములు**

ధ్యానము : అరుణకిరణజాలై రంచితావకాశా
విధృత జప పుటీకా పుస్తకాభీతిహస్తా
ఇతర వరకరఢ్యా ఫుల్లకల్హార సంస్థా
నివసతుహృదిబాలా నిత్యకళ్యాణశీలా.

ఈ మంత్రమునకు దక్షిణామూర్తి ఋషి, పంక్తి ఛందస్సు. ఈ మంత్రమునకు కలశాపముతొలగుటకు ఈ క్రింది మంత్రమును 108 సార్లు చేయవలెను.

ఐం ఐం సౌః క్లీం క్లీం ఐం సౌః సౌః క్లీం

దీనికి చైతన్యము వచ్చుటకు **చేతనా మంత్రము**

ఐం రీం ఔం నూరు జపించిన నిష్కీలమగును.

**ఆహ్లాదినీ మంత్రము :** ఓం క్లీం నమః నూట ఎనిమిది చేయవలెను.

**ఉద్దీపన మంత్రములు :**

1) **వాగ్బీజమునకు :** వదవదవాగ్వాదిని ఐం

2) **కామబీజమునకు :** క్లిన్నే క్లేదిని మహాక్షోభం కురు

3) **సౌభాగ్య బీజమునకు :** ఓం మోక్షం కురు.

బాలామంత్రములోని మూడు బీజములను ఇటు అటు తిప్పుట వలన వివిధ ప్రయోజనములు కల్గును.

1) శత్రునాశనమునకు : ఐం సౌః క్లీం

2) వశీకరణమునకు : క్లీం ఐం సౌః

3) ముక్తికి క్లీం సౌః ఐం

**బాలాగాయత్రి :** త్రిపురాదేవ్యై చ విద్మహే కామేశ్వర్యై చ ధీమహి తన్నః క్లిన్నా ప్రచోదయాత్.

బాలామంత్రము :

**1)** ఐం క్లీం సౌః

**2)** ఐం క్లీం సౌః సౌః క్లీం ఐం

**3)** **అం హ్రీం క్రోం ఐం క్లీం సౌః ఓం హ్రీం శ్రీం బాలాపరమేశ్వరి ఆవేశయ ఆవేశయ మమ హృదయే స్థిరం తిష్ఠ స్థిరం తిష్ఠ హుం ఫట్ స్వాహా.**

మూడు లక్షల జపం ఎఱ్ఱని వస్తువులతో నేతితో, నువ్వులనూనెతో హోమము.

**28.** జైన మంత్రము

**ఓం అసి ఆ ఉసా మహావీరాయ నమః**

ఇది సర్వకార్యసిద్ధికి ఉపయోగించును. లక్షజపము.

**29.** బౌద్ధమంత్రము:

**ఓం మణిపద్మేహుం** దివ్యజ్ఞానమును కార్యసిద్ధిని ప్రసాదించును.

5 లక్షలు పురశ్చరణ సంఖ్య.

**30. మహిషమర్దిని మంత్రము :**

1) మహిషమర్దిని స్వాహా

2) హ్రీం మహిషాసురమర్దిని స్వాహా

3) ఓం హ్రీం మహిషమర్దిని లహ లహ హల హల కఠ కఠ స్తంభయ స్తంభయ అగ్నిం స్వాహా.

**31. శుక్ర స్తంభన మంత్రములు :**

**1) ఓం హ్రీం అగః శుక్ర స్తంభన కారి స్వాహా.**

**2) ఓం క్లీం కామభైరవాయ శుక్రం స్తంభయ స్తంభయ ఠఃఠః స్వాహా.**

పదివేలు జపం.

**32. గ్రహదోషణనివారణకు నరసింహ మంత్రములు**

1) ఓం నమో నరసింహాయ హిరణ్యకశిపు వక్షస్థల విదారణాయ త్రిభువన వ్యాపకాయ భూతప్రేత పిశాచ డాకినీ కులోన్మూలనాయ స్తంభోద్భవాయ సమస్త దోషాన్ హరహర విసర పచపచ హనహన కంపయకంపయ మథమథ హ్రీం హ్రీం హ్రీం ఫట్ ఫట్ ఠః ఠః ఏహి ఏహి రుద్ర ఆజ్ఞాపయతి స్వాహా.

2) గండభేరుండ జ్వాలా నారసింహము

ఓం ఘ్రౌం క్ష్రౌం హ్స్రాం క్లీం హ్రూం క్ష్మ్రీం ఘ్రోం ఘ్రూం హ్రీం అష్టముఖ గండ భేరుండ జ్వాలానారసింహాయ హుంహుం జ్వలజ్వల సర్వ శత్రూన్ ఛింది ఛింది భింది భింది అంధి అంధి కట్ కట్ హుం ఫట్ స్వాహా.

**33.** ఇంద్రాక్షీమంత్రము

ఓం ఐం ఘ్రీం హ్రీం హుం దుం లం శ్రీం ఈం ఇంద్రాక్షి రక్ష రక్ష మమ శత్రూన్ దుఃఖ గ్రంథీన్ స్ఫోటయ స్ఫోటయ మహామారీం భంజయ భంజయ మనోగ్ర గ్రంథీన్ ప్రాణోగ్ర గ్రంథీన్ శరీరగ్రంథీన్ ఘాతయ ఘాతయ హుంఫట్ స్వాహా.

**34.** ప్రసన్న లక్ష్మి మంత్రము

1) **తత్సఐం వితుర్వరే హ్రీంణ్యం భర్గోక్లీం దేవస్య ధీ చాముండాయైమహి ధియోయో విచ్చే నః ప్రచోదయాత్.** ఇది గాయత్రి మంత్రసంపుటితమైన చండీ మంత్రము.

**35.** బ్రహ్మాస్త్రము :

**యాత్ దచోప్రనఃయోయోధి హిమధీ స్యవదేర్గోభణ్యం రేర్వతు విత్సత**

గాయత్రి మంత్రము అక్షరములు వెనుకనుంచి చదివినచో బ్రహ్మాస్త్రం అగును.

**36.** బ్రహ్మదండము:

గాయత్రి మంత్రము పదములు వెనుక నుంచి చెప్పినచో బ్రహ్మ దండము అగును.

**ప్రచోదయాత్ నః యోధియో ధీమహి దేవస్య భర్గో వరేణ్యం సవితుః తత్**

**37.** బ్రహ్మశిరోనామకాస్త్రము:

పాదములు వెనుక నుంచి చదివినచో ఈ మంత్రము వచ్చును.

ధియోయోనః ప్రచోదయాత్ భర్గో దేవస్య ధీమహి తత్సవితుర్వరేణ్యం

**38.** **తిలకధారణ మంత్రము :**

ఓం నమో భగవతి, ముఖకమలవాసిని,
సర్వరాజవశీకరిణి, సర్వగ్రహ దుష్ట మృగపురుషవశంకరి
సర్వసత్వవశంకరి, జగతో భయంకరి హూం హూం ద్రాంద్రీం క్లీం బ్లూం సః
అమృత భైరవ్యై నమః అమృతేశ్వరి స్వాహా.

**39.** **రేణుకా మంత్రములు :**

1) **ఓం శ్రీం హ్రీం క్రోం ఐం** – గురువింద గింజలదండ విల్లమ్ములు ధరించిన కిరాతరూపిణి – దేవత.

2) **క్లీం నమో భగవతి రక్తపంచమి రేణుకాదేవి దహ దహ పచ పచ అఖిల జనం మే వశ్యం కురు కురు స్వాహా.** (నాగాలంకృతయై శూల కపాల ఖడ్గ అంకుశ డిండిమములను ధరించిన దేవత)
ఇది వశీకరణ మంత్రము.

3) **క్లీం నమో భగవతి రక్తపంచమి రేణుకాదేవి వంధ్యాదోషం దహ దహ పచ పచ పుత్రం దేహి క్లీం స్వాహా.**
ఇది సంతాన రేణుకా మంత్రము.

40. బాలగ్రహ నివారణములు : (బాలారిష్టదోషం)

1) **కూష్మాండిని భగవతి రుద్రాణీ ముంచ సర బాలకాత్ గచ్ఛస్వాహా.**
గుమ్మడికాయను పూజించి ఒక వెయ్యి జపం. ఆవపిండితో వేపాకులతో ధూపం వేసిన పిల్లల గ్రహదోషములు పోవును.

2) **ఓం చాముండే శబరి చండికే భగవతి హ్రాం హ్రీం హ్రూం ముంచరక్షాంకురు బలిం గృహ్ణ హుంఫట్ స్వాహా.**
పదివేలు జపం. నిమ్మకాయకోసి కుంకుమ అద్ది బలి ఇవ్వవలెను. లేక కొబ్బరికాయ పీచు పూర్తిగా తీసి కుంకుమరాసి మంత్రము చెపుతూ పిల్లవాని చుట్టూ మూడుసార్లు తిప్పి అవతలగా కొట్టిపారవేయవలెను.

41. యమమంత్రములు

1) **ఓం క్ష్రీం వికృతాననాయ స్వాహా.**

2) **ఓం ధూం ధూం ధూమాంధకారాయ స్వాహా.**
గ్రహదోషనివారణకు మృత్యుభయనివారణకు ఉపయోగించును. ఈ మంత్రములు ఇద్దరి మధ్య విద్వేషణములు కల్గించుటకు కూడా ఉపయోగించును.

42. విద్వేషణము

1) **ఓం ఘర్మటికే మర్కటికే ఘోర విద్వేషణి విద్వేషకారిణి ఘోర ఘోరయోః అముకాముక యోః పరస్పరం విద్వేషం కురు కురు స్వాహా.**

కుడిచేతిలో కాకి ఈక పట్టుకుని ఎడమ చేతిలో గుడ్లగూబ ఈక పట్టుకుని ఇద్దరి పేరులు చెబుతూ వ్యత్యాస హస్తములతో తర్పణము విడిచిన ఇద్దరువ్యక్తులు శత్రువులగుదురు. దున్నపోతు, గుఱ్ఱముల మూత్రములతో కూడ ఈ పని సాధించవచ్చును.

43. ఉన్మాదనము :

1) పిచ్చి ఎత్తించుట :

**ఓం నమో భగవతే ఉన్మత్తరుద్రాయ భ్రమ భ్రమ భ్రామయ భ్రామయ అముకం విత్రాసయ విత్రాసయ ఉద్భ్రామయ ఉద్భ్రామయ రుద్ర రౌద్ర రూపేణ హుం ఫట్ స్వాహా.**

శ్మశానమున రాత్రి వేళల మూడు లక్షల జము చేసి చితాగ్ని యందు ఉమ్మెత్త సమిధలతో హోమము చేయవలెను.

**44.** ఉచ్చాటన విద్య

1) **ధూం ధూం ధూమావతి స్వాహా**

2) **కాకి కాకరుతే కాకి కాకపిండోపహారిణి కిలి కిలి అముకస్య హృదయం బంధ బంధ గృహ్ణ గృహ్ణ గచ్ఛ గచ్ఛ స్వాహా**

ఏడు రోజులు ఈ మంత్రమును జపిస్తూ, ప్రతిరోజూ ఎఱ్ఱ అన్నము కాకికి బలివేసినచో శత్రువు ఆగమ్మ కాకివలె దిక్కులు పట్టిపోవును.

కాకిని చితాగ్ని యందు దహించి భస్మము మంత్రించి శత్రువు ఇంటిమీద చల్లినచో వాడు ఆ ఇంటి నుండి వెళ్ళిపోవును.

**45.** అగ్ని స్తంభనము

1) ఓం నమో భగవతే వాయవే మర్దయ మర్దయ ప్రమర్దయ ప్రమర్దయ స్తంభయ స్తంభయ హిలి హిలి సంహర సంహర స్వాహా.

**46.** జలస్తంభనము

**ఓం నమో భగవతే వరుణాయపు పు స్తంభయ స్తంభయ స్వాహా.**

కప్ప వస యొక్క పొడిని మంత్రించి ధరించినచో అగ్ని జలస్తంభనములు జరుగును.

**47.** అదృశ్యమునకు

1) **ఓం శ్మశాన వాసిని ప్రేత మాలిని మాం మాపశ్యంతు మనుష్యాః స్వాహా**

చితాభస్మము మంత్రించి త్రిపుండ్రధారణము చేయవలెను.

**48.** తిరస్కరిణి మంత్రము

1) ఓం ప్రీం ఈం ఆం ప్రీం క్రోం శ్రీం క్లీం క్లాం ఓం నమో భగవతి తిరస్కరిణి మహామాయా స్వరూపిణి మమ శత్రు ఫట్ ఫట్ పరాజయార్థే పురుష స్త్రీ పశు రాజవశంకరి క్లీం క్లాం రాజస్య ముఖం వాచం పదం వాక్యం బుద్ధిన్ వశ్యం వషట్ శ్రీం ఘ్రీం ఘ్రుం కురుకురు వౌషట్ క్లాం క్లీం శ్రీం క్రోం ప్రీం ఆం ఈం ప్రీం ఓం ఫట్ ఫట్ స్వాహా.

**49.** మృత్యునాశని మంత్రము

**ఓం సహస్ర జ్వలని మృత్యునాశని రం స్వాహా.** సంధ్యాసమయములయందు దక్షిణ దిక్కు వైపు కూర్చుండి జపించవలెను.

**50.** కర్ణవిద్యలు

1) **అవతర అవతర స్వాహా**

మర్రిచెట్టు కింద కూర్చుండి కుబేరుని పూజించి బెల్లము, పాలతో వండిన

పాయసము నివేదించి రోజుకు ఎనిమిది వేలు చొప్పున నెలరోజులు జపము చేయవలెను. తరువాతమరొక నెలరోజులు జ్యోతిష్మతి తైలంతో ప్రతిరోజు 108 ఆహుతులతో హోమము చేయవలెను. తరువాత అర్ధరాత్రి అంకోల ఘృతముతో వెయ్యి ఆహుతులతో హోమము చేయవలెను. ద్రోణ పుష్పములు పూజకు ఉపయోగించవలెను.

2) **త్రిజట లంబోదర వామన వటు కథయ కథయ కథాపయ కథాపయ హుం ఫట్ స్వాహా.**
భక్ష్యములతో వామనుని పూజించి మూడు లక్షలు జపము చేయవలెను.

3) **'సులభే స్వాహా'**
మర్రిచెట్టు కింద కూర్చుండి మధ్యాహ్నవేళ బదరీ కదంబ పుష్పములతో సులభాదేవిని పూజించి, తెలగపిండితో మినపపప్పుతో వండిన అన్నము నైవేద్యము చేసి మూడు లక్షల జపము చేయవలెను. అంకోలఘృతముతో రెండు వేల హోమము చేయవలెను. సాక్షాత్కరించిన యక్షిణితో సాధకుడు రతిక్రీడ చేయవలెను. ఆమె తృప్తి చెందినచో భూతభవిష్యత్ వర్తమానములు చెప్పుటయే కాక బలమును తేజస్సును విద్యను ధనమును ప్రసాదించును.

4) **ఓం నమః కర్ణ పిశాచి వర కనక వజ్ర వైదూర్య ముక్తాభరణ నిర్మలాలంకృత శరీరిణి ఏహి ఏహి ఆగచ్ఛ ఆగచ్ఛ త్రైకాలిక దర్శిని మమ కర్ణం ప్రవిశ్య అతీతానాగత వర్తమానం కథయ కథయ రుద్రో జ్ఞాపయతి స్వాహా.**
శివాలయమున శివునిపూజించి సన్నిధిలో లక్షజపము చేయవలెను.

5) **ఓం శ్రవణ పిశాచిని చాముండే స్వాహా.** విభీతక వృక్షం (తాని చెట్టు) క్రింద కూర్చుండి లక్ష జపం చేయవలెను. ఆతరువాత 21 రోజులు రాత్రిపూట పక్కపై దిగంబరుడై కూర్చుని 108 సార్లు జపించవలెను.

6) **శ్రీమధుమతి స్థావర జంగమాకర్షిణి ఠం ఠం స్వాహా.** అరటితోటలో లక్షజపం చేయవలెను. త్రికాల వార్తలు చెప్పుటయే కాక కోరిన వస్తువులను తెచ్చిపెట్టును.

7) **ఓం హ్రీం పద్మావతి త్రైలోక్య వార్తాం కథయ కథయ స్వాహా.**
లక్ష్మీదేవి ఆలయమున కాని జైనుల ఆలయము నందు కాని జపము చేయవలెను.

8) **ఓం హ్రీం క్లీం హూం హిలి హిలి కర్ణమాతంగి అమోఘే సత్యవాదిని త్రికాల వార్తాం కథయ కథయ స్వాహా.**

లక్ష జపం మధువు (తేనె) నైవేద్యము, ఇప్పపూలు, మారేడు దళములతో హోమము.

**51.** స్వప్న విద్యలు

1) **ఓం హ్రీం స్వప్నేశ్వరి కార్యం మేవద స్వాహా.** లక్షజపము, పదివేలు మారేడు దళములతో హోమము. ఆ తరువాత రాత్రివేళ పదివేలు జపముచేసి భూశయనము చేసిన దేవి కలలో కనిపించి కోరినది చెప్పును.

2) **అం హ్రీం క్రోం శ్రీం హ్రీం క్లీం రక్త చాముండే స్వప్నే కథయ కథయ స్వాహా.**

21 రోజులలో లక్ష జపము చేయవలెను. స్వప్న సిద్ధి కలుగును.

3) **ఓం హ్రీం క్రీం స్వప్నేశ్వరి అతీతానాగత దృశ్యం దర్శయ దర్శయ వద వద స్వాహా.**

లక్ష జపం మారేడు దళములతో హోమం.

4) **ఓం శుక్లే మహా శుక్లే హ్రీం శ్రీం క్రీం అవతర అవతర స్వాహా.**

రోజుకు ఎనిమిది వేల చొప్పున మూడు రాత్రులు దేవి సన్నిధిలో చేయవలెను.

5) **ఓం హ్రీం క్రీం కలిం మహాకాలి కిలి కిలి ఫట్ స్వాహా.** లక్షజపము, మారేడు దళములతో హోమము.

6) **'ఓం హ్రీం నమో వారాహిఘోరే స్వప్నం ఠః ఠః స్వాహా**

లక్షజపం, దశాంశహోమము.

7) **ఓం హ్రీం స్వప్న వారాహి కాళి స్వప్నం కథయ అముకస్య అముకం దేహి క్రీం స్వాహా.**

రోజుకు వెయ్యి చొప్పున నాలుగు సంవత్సరములు జపము చేయవలెను. సాధకునకు కలలో ఏది కోరినను చెప్పయే కాక ఎవని కలలోనికి ఏ రూపమున వెళ్ళి ఏమి చెప్పి రమ్మనిన అది చెప్పి వచ్చును.

**52.** నిధి దర్శనం :

భూమిలో పూర్వులు దాచిన నిధులను తెలుసుకొనుటకు భైరవ, బేతాళ విద్యలను ఇంతకు ముందు ఇచ్చి ఉన్నాము.

అట్టిదే మేఖలా యక్షిణి మంత్రము. ఇప్ప చెట్ల తోటలో ఇప్ప చెట్టు కింద కూర్చుని రాత్రివేళ పదునాల్గు రోజులు రోజుకు పదివేలు జపము ఇప్ప కట్టెలతో వెలిగించిన అగ్ని యందు తేనెలో ముంచి ఇప్పపూలతో రోజుకు వెయ్యి హోమము చేయవలెను. సంతోషించిన దేవత అంజనము ఇచ్చును. దానిని కన్నులకు ధరించిన భూమిలోని నిధులు కన్పించును.

1) **మంత్రము : ఓం క్రొం మదనమేఖలే నమః స్వాహా.**
2) **వటయక్షిణి :** నిర్మానుష్య వనమున మర్రి చెట్టు క్రింద రోజూ వెయ్యికి తక్కువ లేకుండా ఏడు రాత్రులు జపించి చందనముతో మండలము చేసి దానిలో నేతి దీపము పెట్టి దేవతను బంధూక పుష్పములతో పూజించి ధ్యానించిన గజ్జెల చప్పుడుతో గానంతో వటయక్షిణి వచ్చును. ఆమెను రతిక్రీడలో సంతృప్తిపరచిన కోరిన కోరికలు ఇచ్చును.

   మంత్రము : విశ్రవుడు దర్శించినది.

   **ఏహ్యేహి యక్షి యక్షి మహా యక్షి వటవృక్ష నివాసిని శీఘ్రం మే సర్వ సౌఖ్యం కురు కురు స్వాహా.**

**53.** మృతసంజీవని :

మం: **ఓం మృతసంజీవని మృతముత్థాపయోత్థాపయ స్వాహా.** శ్మశానమున మూడు సంవత్సరములు రోజుకు వెయ్యి చొప్పున చేయవలెను.

**54.** బాణేశీ మంత్రము :

సమ్మోహన ఋషి, గాయత్రి ఛందస్సు.

మం॥ **ద్రాం ద్రీం క్లీం బ్లూం సః** - 5 లక్షల జపము అశోక పుష్పములను పెరుగులో ముంచి రోజుకు వెయ్యి చొప్పున 3 రోజులు హోమము చేసిన వశీకరణము. పెరుగుతో కలిపిన పేలాలతో హోమము చేసిన శీఘ్ర వివాహ ప్రాప్తి సుగంధకుసుమములతో చేసిన అభీష్ట సిద్ధి.

**55.** కామేశీ మంత్రము

సమ్మోహన ఋషి, గాయత్రి ఛందస్సు

**మం॥ హ్రీం క్లీం ఐం బ్లూం స్త్రీం.** అయిదు లక్షల జపము దశాంశము మోదుగ పూలతో హోమము. అభీష్టసిద్ధి.

**56.** ఆకర్షణ మంత్రము

**ఓం నమః కాళికాయై సర్వాకర్షిణ్యై అముకం ఆకర్షయ ఆకర్షయ శీఘ్రమానయ శీఘ్రమానయ భద్రకాళ్యై నమః**

ఎర్రగన్నేరు పూలతో కాళిని పూజించి నేతితో కలిపిన శనగలతో హోమము చేయవలెను. దగ్గర వ్యక్తిని ఆకర్షించుటకు మూడు రాత్రులు దూరమున ఉన్న వ్యక్తిని ఆకర్షించుటకు తొమ్మిది రాత్రులు పట్టును. కృష్ణాష్టమి నుండి కృష్ణ చతుర్దశి వరకు ప్రొద్దుటి పూట బొడ్డు లోతు నీళ్ళలో నిలబడి రోజు పదకొండు వందలు చొప్పున జపము చేయవలెను. ఆకర్షించవలసిన మనిషి యొక్క ఫోటోను అది దొరకనిచో పిండితో బొమ్మ చేసి దానికి కాటుక వ్రాసి దానిపై పేరు వ్రాసి అమ్మవారి ముందు పెట్టి జపము చేసిన వేగాకర్షణము.

**57. బంధ మోచన యక్షిణి**

**మం : ఓం నమో హటేలే కుమారి స్వాహా**

రోజుకు రెండు వేల చొప్పున ఏడు రోజుల జపించి దశాంశము పాలు నేతితో హోమము చేసి మధుర పదార్థములతో ఒక స్త్రీకి భోజనము పెట్టిన దేవి ప్రసన్నయై బంధమోచనము ప్రసాదించును.

**58. ఓషధీ గ్రహణ యక్షిణి**

**మం: ఓం హ్రీం సర్వతేసర్వతే శ్రీం క్లీం సర్వోషధి ప్రాణదాయిని నైరృత్యే నమో నమః స్వాహా.** మూలికలను తీయునపుడు ఈ మంత్రమునుపయోగించిన అది శక్తిమంతమగును.

**59. అదృశ్యకరణ యక్షిణి**

**మం. ఓం కనకవతి కరవీరకే స్వాహా**

కృష్ణపక్ష అష్టమి నుండి అమావాస్య వరకు రోజుకు మూడు వేలు జపం. నేతితో తడిపిన గన్నేరు పూలతో వేపసమిధలతో హోమము చేయవలెను.

**60. చేటక యక్షిణి**

**మం. ఓం జీవ పాతాళమర్దనే హుం స్వాహా**

యాభై రెండు వేల జపము, చేమంతి పూలతో హోమము. అద్భుతమైన బలము వేగముగా నడుచు శక్తి లభించును.

**61. చంద్రికాయక్షిణి :**

**ఓం హ్రీం చంద్రికే హంసః స్వాహా.** శుక్లపక్ష వెన్నెలలో లక్ష జపించిన శారీరక మానసిక ఆరోగ్యములు కల్గును. అమృతసిద్ధి లభించును. మందులను ఈ మంత్రముతో మంత్రించి ఇచ్చిన వేగముగా పనిచేయును శుక్లపాడ్యమి నుండి పౌర్ణమినాటికి పురశ్చరణ పూర్తి చేయవలెను.

62. మాహేంద్ర యక్షిణి :

మం. మాహేంద్రి దులుకులు హంసః స్వాహా

ఇంద్రధనస్సు ఉదయించినపుడు నిర్గుండీ వృక్షము కింద జపము మొదలు పెట్టి ఉపవాసముతో లక్షజపము చేయవలెను. పాతాళసిద్ధి, సర్వభోగప్రాప్తి కలుగును.

63. లక్ష్మి యక్షిణి

**ఓం ఐం లక్ష్మి వం శ్రీం కమలధారిణి హంసః స్వాహా.** లక్షజపం, నేతితో తడిపిన గన్నేరు పూలతో హోమము చేసిన యక్షిణి సిరిసంపదలు, రసాయనము నిచ్చును.

64. శ్మశాన యక్షిణి

1) **ఓం క్లీం భగవతీభ్యో నమః**

2) **ఓం హ్రూం హ్రీం స్ఫం శ్మశాన వాసిని శ్మశానే స్వాహా.**

శ్మశానమున నగ్నుడై యాభై వేలు జపించిన యక్షుడు వస్త్రము నిచ్చును. అది ధరించిన అదృశ్యుడగును. ఆదేవత ఇతర సిద్ధులను కూడా ఇచ్చును.

65. భోగ యక్షిణి

**ఓం నమ ఆగచ్ఛసురసుందరి స్వాహా**

అరవై వేలు జపం- పంచ ఖాద్యములతో హోమం. యక్షిణి సర్వభోగములను ప్రసాదించును.

66. ద్వార యక్షిణి

**ఓం ద్వార దేవతాయై హ్రీం స్వాహా.**

ఇరవై ఆరువేల జపము. గుగ్గులు, నెయ్యి హోమద్రవ్యము, హోమభస్మముధరించి ఏ యింటిలోనికి వెళ్ళునపుడయినను ద్వారము దాటుతూ ఈ మంత్రము జపించిన అక్కడివారు వశీకృతులు అగుదురు.

67. విద్యాయక్షిణి :

**ఓం హ్రీం వేదమాతృభ్యః స్వాహా**

ఇరవై అయిదు వేలు జపము. పంచఖాద్యహోమము. జపించినచో చదువు బాగా వచ్చును.

**68. వహ్ని వాసిని మంత్రము**

**ఓం హ్రీం రం వహ్ని వాసిన్యై నమః**

ఇది ఆత్మరక్షణకు పనికివచ్చును. సాధకుని చుట్టు అగ్నివలయం ఏర్పడి అన్ని ప్రమాదముల నుండి రక్షించును. జపసంఖ్య లక్ష.

**69. విజయా మంత్రము**

**మం. ఐం హ్ స్ ఖ్ ఫ్ రేం విజయాయై నమః**

లక్షజపం – సర్వకార్యముల యందు విజయము ప్రసాదించును.

**70. సర్వమంగళా మంత్రము**

1) **ఓం స్వాం సర్వమంగళాయై నమః**

2) **సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే**
**శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే**

లక్షజపము, శుభములను ప్రసాదించును.

**71. విశాలా మంత్రము**

1) **ఓం ఐం విశాలే హ్రీం శ్రీం క్లీం స్వాహా.** చింతచెట్టు కింద లక్షజపము. దశాంశహోమం రససిద్ధి. ఆయురారోగ్యములు కల్గును.

2) **ఓం హ్రీం యక్షిణి ఆకర్షిణి ఘంటాకర్ణే ఘంటాకర్ణే విశాలే స్వప్నం దర్శయ దర్శయ స్వాహా.**
రోజుకు పదకొండు వేలు చొప్పున పదకొండు రోజులు రాత్రివేళ చేసినచో స్వప్న సిద్ధి కల్గును. ఈ సాధన చేయువారు ఘంటాకర్ణ మంత్రము ముందు ఒక లక్ష చేసినచో వేగముగా సిద్ధి కల్గును.

## ఘంటాకర్ణ మంత్రము

**ఓం ఘంటాకర్ణ మహావీర సర్వోపద్రవ నాశనం కురుకురు స్వాహా.**

**72. చింతామణి మంత్రములు**

1) **ఓం హ్రీం ఓం** – ప్రణవ చింతామణి – దివ్యజ్ఞానమును ప్రసాదించును. దీనినే శివ చింతామణి అని కూడాఅందురు.

2) **సరస్వతీ చింతామణి : ఐం హ్రీం ఐం** విద్యను ప్రసాదించును.

3) **లక్ష్మీ చింతామణి : శ్రీం హ్రీం శ్రీం** ఐశ్వర్యమును ప్రసాదించును.

4) **కామచింతామణి : క్లీం హ్రీం క్లీం** వశీకరణమును ప్రసాదించును.

5) **గణపతి చింతామణి : గం హ్రీం గం** విఘ్నములను తొలగించును. సిద్ధిని కల్గించును. **శ్రీం గ్లౌం శ్రీం** అనునది లక్ష్మీగణపతి చింతామణి

మంత్రముగా ఉపయోగించబడుచున్నది.

ఈ చింతామణి మంత్రములకు 3 లక్షల పురశ్చరణ చేయవలెను. దశాంశ హోమము.

**73. ఏకాక్షరీ మంత్రములు :**

**ఓం** – ప్రణవము దీనిని జపించిన దివ్యజ్ఞానము, వైరాగ్యము కల్గును. గృహస్థులు జపించినచో సంసారబంధముల నుండి విముక్తులగుదురు. కనుక దీనిని దృష్టిలో పెట్టుకుని సాధన చేయవలెను.

**ఐం** : సరస్వతీ మంత్రము. దీనిని జపించిన అఖండమైన విద్య లభించును.

**హ్రీం** : మాయా బీజము. దీని జపముచే సర్వశక్తులు లభించును.

**క్లీం** : మన్మధ బీజము : దీని జపముచే లోక వశీకరణం లభించును.

**శ్రీం** : లక్ష్మీబీజము.దీని జపముచే అపారమైన ఐశ్వర్యము ప్రాప్తించును.

**గం** : గణపతి బీజము. సర్వవిఘ్నములు తొలగుటయేకాక కార్యసిద్ధి కల్గును.

**దం/ద్రాం** :దత్తాత్రేయ బీజము. దీని జపముచే దత్తస్వామి అనుగ్రహము వేగముగా లభించును.

**హూం** : క్రోధ బీజము. దీని జపముచే సర్వశత్రు వినాశము కల్గును.

**హ్రాం** : సూర్య బీజము. దీని జపముచే ఆరోగ్యము కల్గును.

**క్రీం** : కాళీ బీజము. దీని జపముచే కాళీదేవి ప్రసన్నురాలగును.

**సోం** : ఆరోగ్యమునిచ్చు చంద్రబీజము.

**జూం**: మృత్యుంజయ బీజము. అకాలమృత్యువు తొలగి దీర్ఘాయువు లభించును.

**ధూం** : ధూమావతీ బీజము. దీని జపముచే శత్రూచ్చాటనము జరుగును.

**త్రీం** : తారాబీజము. దీని జపముచే తారామంత్రము సిద్ధి కల్గును.

**74. మృతజీవాకర్షణ మంత్రము.**

1) పైన చెప్పబడిన ఆకర్షణ మంత్రములలో దేనినైనను ఉపయోగించవచ్చును దీని కొరకు ప్రత్యేక మంత్రము –

2) హ్లౌం హ్లౌం హస హస అముక ఆత్మా ఆకర్షయ జాగ్రయ స్ఫుటయ ఫట్. మనకు కావలసిన జీవుని చిత్రము పెట్టి దాని చుట్టూ నాల్గువైపుల రుద్రాక్షలు పెట్టి లేక రుద్రాక్షమాలలో ఫోటో పెట్టి ఈ మంత్రమును జపించవలెను. రోజుకు రెండు వేల చొప్పున అయిదు రోజులు రాత్రి వేళ జపము చేయవలెను. మరణించిన వారిలో తనకు ఆత్మీయులయిన వారిని పిలుచుటకు ఇది ఉపయోగించును. సంవత్సరమున కొకసారి ఆ

వ్యక్తి మరణించిన రోజు వచ్చినపుడు ఈ మంత్రముతో ఆవాహన చేసిన తప్పక రాగలరు. అయితే భూలోకపు పరిధిని దాటి సుదూర ప్రదేశములలో స్వర్గ నరకములలో ఉన్నపుడు ఆ లోక పరిపాలకుడు అనుమతించక పోవచ్చును. మంత్రిసిద్ధులు తన ఇష్టదేవతా మంత్రముతో ఆవాహన చేసిన ఆ దేవత వెళ్ళి జీవుని తెచ్చును.

**75. సిద్ధావాహన మంత్రములు**

1) **ఓం హ్రీం సిద్ధాత్మా భం సం మం పం సం క్షం పరమగురో ప్రసీద హ్రీం ఓం.**

ఈమంత్రము వలన సిద్ధమండలములోని ఎవరో ఒక సిద్ధుడు వచ్చి అనుగ్రహించడం జరుగుతుంది. లక్ష జపము దశాంశము నేతితో ఎర్రని పూలతో హోమము. ఈ మంత్రములోని బీజాక్షరములు భంసం మంపం సం క్షం అనునవి పరకాయ ప్రవేశ విద్యగా తంత్ర గ్రంథములలో చెప్పబడినది.

**76. వస్తు సృష్టి : (ఆకర్షణ)**

వస్తువులను సృష్టించి తెచ్చుట సామాన్యముగా జరుగదు. ఎక్కడో దూరముగా ఉన్న వస్తువులను సిద్ధించిన మంత్రదేవత తెచ్చి ఇస్తుంది. బేతాళుడు,భైరవుడు, మధుమతి, సిద్ధ యక్షిణి, మహామాయా యక్షిణి, మాంతంగీశ్వరి మొదలగు దేవతలు, వస్తువులను ఆకర్షించి తెచ్చి పెట్టగలవు. వానిలో కొన్నింటి సాధనలు ఈ గ్రంథములో ఈయబడినవి. ఇవి కాని వీనిలో ఏవైనా కాని పైన చెప్పిన మంత్రసాధనలన్నీ సిద్ధగురువు వలన ఉపదేశము పొంది పురశ్చరణ చేసినచో ఫలితము లభించును. నచ్చిన గురువు దొరకనపుడు మహాదేవుని గురువుగా భావించి సాధనచేసే పద్ధతి ముందు చెప్పబడినది.

**67. తీవ్రసాధన పద్ధతి**

రాజస తామస విద్యలలో ఎన్ని రకములు సాధనలు చేసినా దేవతానుగ్రహము కలుగనపుడు తంత్ర గ్రంథములలో ఒక పద్ధతి చెప్పబడినది. సాధకుడు జన సంచారము లేని ప్రదేశమున రావిచెట్టును ఒకదానిని ఎన్నుకుని అక్కడకు ఒక్కడే వెళ్ళి రాత్రిపూట మొదటి జాము దాటిన తర్వాత శ్మశాన భస్మముతో యంత్రము వేసి దానిపై నరకపాలమును పెట్టి దానిలో ఆవనూనె పోసి పెద్దదీపము వెలిగించి దానిలోనికి దేవతను ఆవాహనము చేసి ఎదురుగా కూర్చుని జపము చేయవలెను. భీషణ ధ్వనులు వినిపించినా భయము కొలిపే దృశ్యాలు కనిపించినా సాధకుడు భయపడకుండా ఆపకుండా జపము

చేయవలెను. దేవత వచ్చినపుడు సమర్పించుటకు, మధుర భక్ష్యములను, మద్యము, రక్తాన్నమును, మాంసఖండములను సిద్ధము చేసుకొని ఉండవలెను. బహుళ పక్ష అష్టమినాడు కాని, బహుళ చతుర్దశినాడు కాని ఈ సాధన చేయవలెను. ఇటువంటి ప్రదేశములలో శ్మశానములలో సాధన చేయువారు ధైర్యము కలవారై ఉండవలెను. అంతకుముందే పురశ్చరణలు చేసి హోమములు చేసి దేవతానుగ్రహము కొంతపొంది ఉన్నచో ఈ ప్రదేశములలో ధైర్యముగా సాధన చేయగలరు. లేని పక్షంలో దేవాలయములలో సిద్ధ క్షేత్రములలో ఋషుల ఆశ్రమములలో మహనీయుల సమాధుల దగ్గర సాధనలు చేయుట ప్రమాదరహితము. కనుక సాధకులు తమకు తగిన మార్గము ఎన్నుకుని మంత్రసాధనలు చేసి అభీష్ట సిద్ధిని సాధింతురు గాక.

(సూచన : మంత్రములలో అముక అని ఉన్నచోట కావలసిన వ్యక్తి పేరుచెప్పవలెను. ప్రాణప్రతిష్ఠా మంత్రములో అముక స్థానములో దేవత పేరు చెప్పవలెను.)

**68. హోమాధికారము**

సాధనలో హోమము అత్యంతశక్తిమైనదని ఇదివరకే చెప్పబడింది. వైదిక సంప్రదాయము ననుసరించి ఉపనయనమయిన ద్విజులు మాత్రమే వేదమంత్రములతో హోమము చేయుటకు అర్హులు. అయితే వేదమంత్రములతో సంబంధం లేకుండా తంత్ర గ్రంథోక్తములయిన మంత్రములతో హోమకార్యము చేయటానికి అందరికీ అధికారము ఉన్నదని మేరుతంత్రము, మంత్రమహోదధి మొదలైన గ్రంథములు చెప్పుచున్నవి. కనుక ఈ పద్ధతిలో అగ్నిని దేవతను ఆవాహన చేసి అన్ని కులముల వారు, స్త్రీ పురుషులు హోమము చేయవచ్చును. అక్కడక్కడ యజ్ఞములలో హైందవేతర మతస్థులు వచ్చి పాల్గొనటానికి ఔత్సుక్యము చూపించుట జరుగుచున్నది. మన దేవతల యందు భక్తి కలిగినచో దానికి అభ్యంతర పెట్టవలసిన పనిలేదు.

తంత్రగ్రంథములలో ఇవ్వబడిన సంస్కృత మంత్రములకు మాత్రమే హోమము చేసే ఆచారమున్నది. ప్రపంచములో అనేక భాషలలో మంత్రములున్నవి. వానిలో హోమము చేసే ఆచారము లేదు. అటువంటి వానికి నైవేద్యములు బలులు సమర్పించుట ఆచారము.

**69. బీజాక్షర సంకేతములు**

1. ఓం – ప్రణవము – సృష్టికి మూలము.
2. హ్రీం – శక్తి లేక మాయా బీజము.

3. ఈం – మహామాయ
4. ఐం – వాగ్బీజము
5. క్లీం – మన్మథ బీజము
6. సౌః – సౌభాగ్య బీజము
7. ఆం – పాశబీజము
8. క్రోం – అంకుశము
9. హ్రాం – సూర్యబీజము
10. సోం,సః– చంద్రబీజములు
11. లం – ఇంద్రబీజము, పృథివీ బీజము
12. వం – వరుణ బీజము, జలబీజము
13. రం – అగ్నిబీజము
14. హం – ఆకాశబీజము, యమ బీజము
15. యం – వాయు బీజము
16. శం – ఈశాన్య బీజము, శాంతిబీజము
17. షం, క్షం – నిరృతి బీజములు
18. సం – సోమ (కుబేర) బీజము
19. జూం – మృత్యుంజయ, కాలభైరవ బీజము
20. భం – భైరవ బీజము
21. శ్రీం – లక్ష్మీ బీజము
22. హ్సౌం – ప్రాసాద బీజము, హయగ్రీవ బీజము
23. క్ష్రౌం – నరసింహబీజము
24. ఖేం – మారణ బీజము
25. ఖట్ – సంహార బీజము
26. ఫట్ – అస్త్ర బీజము
27. హుం – కవచబీజము
28. వషట్ – వశీకరణము
29. వౌషట్ – ఆవేశబీజము
30. ఠుం – బందీ దేవీబీజము
31. ష్ట్రీం – యమ బీజము
32. ధూం – ధూమావతీ బీజము
33. క్రీం – కాళీబీజము
34. గం – గణపతి

35. గ్లౌం - వారాహి, గణపతి
36. ఘే - గణపతి
37. త్రీం - తారాబీజము
38. స్త్రీం - తారాబీజము
39. హూం - కూర్చము, క్రోధము, ధేనువు
40. బ్లూం - సమ్మోహనము
41. ద్రాం - ద్రావణ బీజము, దత్తాత్రేయ బీజము
42. ద్రీం - ఉద్దీపనము
43. దం - దత్తాత్రేయ బీజము
44. అం - బ్రహ్మబీజము
45. కం - బ్రహ్మ బీజము
46. ఇం - నేత్రబీజము
47. ఉం - శ్రోత్ర బీజము
48. హ్లీం, హ్రీం - బగళాబీజము
49. గ్రీం - గణపతి
50. ఠ - స్తంభనము
51. హిలి - వశీకరణము, దేవతాభాషణము
52. కిలికిలి - దేవతా భాషణము
53. చులు - బాధానివారణ
54. హులు - బాధానివారణ

ఇవికాక ఇంకా ఎన్నో బీజాక్షరములు మంత్రములలో ఉపయోగించబడినవి. ప్రసిద్ధమైనవి ఎన్నిక చేసి ఈయబడినవి. సాధకులు తమ మంత్రములో లేకున్నను కావలసిన శక్తి కొరకు ఆయా బీజములను తగిన స్థానము నందు కలుపుకొనవచ్చును.

**70. మంత్రాక్షర పరిశీలన**

గాయత్రి, శివపంచాక్షరి, నారాయణఅష్టాక్షరి మొదలగు మంత్రములను, తమ యింటిలో క్రమానుగతంగా వచ్చిన మంత్రములను సాధన చేయటానికి ఏ అభ్యంతరము లేదు. అలా కాక కొత్త మంత్రమును చేయాలనుకొన్నప్పుడు ఆ మంత్రము యొక్క మొదటి అక్షరము తనకు సరిపోతుందో లేదో చూచుకోవాలి. దీనికి పద్ధతి -

1) సిద్ధము 2) సాధ్యము 3) సుసిద్ధము 4) అరి.

సాధకుని పేరులోని మొదటి అక్షరము. (ఇంటి పేరు లెక్కలోకి రాదు) సిద్ధస్థానము. అంటే ఆ బీజాక్షరంతో మొదలయ్యే మంత్రము అతనికి పురశ్చరణ సంఖ్యతో సిద్ధిస్తుంది. అ కారము నుండి క్ష కారము వరకు అక్షర అనుక్రమణికలో చూచుకోవాలి. ఎ, ఒ - సంస్కృతములో లేవు గనుక వాటిని లెక్కలోకి తీసుకోరాదు.

మంత్రము యొక్క మొదటి అక్షరము సాధ్యస్థానము లోనికి వస్తే రెట్టింపు జపం చేయాలి. సుసిద్ధ స్థానంలోనికి వస్తే సగం జపంచాలు. అరి స్థానం లోనికి వస్తే మంత్రం సిద్ధించదు.

ఉదాహరణకు రామారావు అనే పేరు గల సాధకునకు ర తో మొదలయ్యే మంత్రం సిద్ధిస్తుంది ల తో మొదలయ్యే దానికి రెట్టింపు కష్టపడాలి. వ తో మొదలయ్యేది సగం జపం చాలు. శ తో మొదలయ్యేది శత్రుస్థానము - పనికిరాదు. అదే పద్ధతిలో మిగతా అక్షరాలు చూచుకోవాలి. అంటే రా మొదటి అక్షరం గల వానికి ష - సిద్ధ స్థానము, స-సాధ్యము, హ-సుసిద్ధము, ళ - అరి ఇలా

హల్లుతో మొదలయ్యే బీజాలలో అచ్చుకు ప్రాధాన్యం లేదు. అంటే సుబ్రహ్మణ్యం లో స-తో మాత్రమే చూచుకోవాలి.

సాధకుడు తాను చేయ తల్చుకున్న మంత్రంలో సహజంగా తనకు మొదటి అక్షరం సరిపోకపోతే మంత్ర గుణ లక్షణములను బట్టి తనకు సరిపోయే బీజాక్షరమును ముందు పెట్టుకోవాలి. సిద్ధస్థానంలో ఉన్న బీజాక్షరం కాని సుసిద్ధస్థానంలో ఉన్న బీజాక్షరం కాని ఎంపిక చేసుకోవాలి.

## 71. మంత్రాక్షర సంఖ్య

సాధకుడు తాను చేసే మంత్రంలో ఎన్ని అక్షరములున్నవి లెక్కపెట్టుకోవాలి. అచ్చు, అచ్చుతో గూడిన హల్లు మాత్రమే లెక్కలోకి వస్తాయి. అర్ధాక్షరములు (్) బిందువు, విసర్గ (ం, ః) లెక్కలోకి రావు. ఉదాహరణకు ఫట్ అనునది ఒక అక్షరము మంత్రమే. క్లీం అనునది ఒక అక్షరము. ఇలా చూసుకోవాలి. సాధకుని పేరు సరిసంఖ్యలో ఉన్న యెడల మంత్రం బేసి సంఖ్యలో ఉండవలెను. పేరులోని అక్షరములు బేసిలో ఉన్న యెడల మంత్రము సరి సంఖ్యలో ఉండవలెను. గాయత్రి, పంచాక్షరి మొదలైన మంత్రములకు ఈ నియమము వర్తించదు. ఏకాక్షరి మాలామంత్రములకు కూడా ఇది వర్తించదు. ఒక్క గాయత్రిని వదిలి మిగిలిన మంత్రములన్నింటికి ఈ నియమం పాటించుట మంచిది.

**72. నక్షత్ర వృక్షములు**

ఏవ్యక్తి అయినను తన నక్షత్రపు వృక్షమును నరక రాదు. నరికినచో ఆయుః క్షీణము మంత్రసాధకుడు తన చెట్టును పూజించినచో వేగముగా మంత్రసిద్ధి అగును.

1. అశ్వని – విషవృక్షము, కౌరస్కరము
2. భరణి – ఉసిరిక
3. కృత్తిక – ఉదుంబరము
4. రోహిణి – జంబూ వృక్షము – నేరేడు
5. మృగశిర – ఖదిర – చంద్ర
6. ఆరుద్ర – కృష్ణా
7. పునర్వసు – వంశ – వెదురు
8. పుష్యమి – పిప్పల – రావి
9. ఆశ్లేష – నాగ
10. మఖ – న్యగ్రోధ – రోహిణి
11. పుబ్బ – పలాసము – మోదుగ
12. ఉత్తర – ప్లక్ష
13. హస్త – అంబష్ఠ
14. చిత్త – బిల్వ –మారేడు
15. స్వాతి – అర్జున – మద్ది
16. విశాఖ – వికంకత
17. అనూరాధ – వకుళ
18. జ్యేష్ఠ – సరళ, పిప్పీ
19. మూల – సర్జ
20. పూర్వాషాఢ – వంజుల
21. ఉత్తరాషాఢ – పనస
22. శ్రవణం – అర్క – జిల్లెడు
23. ధనిష్ఠ – శమీ – జమ్మి
24. శతభిషం – కదంబ – కడిమి
25. పూర్వాభాద్ర – నింబ – వేప
26. ఉత్తరాభాద్ర – ఆమ్ర – మామిడి
27. రేవతి – మధూక – ఇప్ప

### 73. యంత్రప్రక్రియలు

మంత్రసాధన మార్గంలో యంత్రమునకు ఎంతో ప్రాధాన్యమున్నది. దేవాలయములలో కూడా విగ్రహము కింద యంత్రము పెడ్తారు. యంత్రమునకు దేవతాశక్తి వేగంగా ఆకర్షించే లక్షణమున్నది. షట్ ప్రయోగములగు శాంతి, వశ్యము, స్తంభనము, ఉచ్చాటనము, విద్వేషణము, మారణము ఈ ఆరింటికి వివిధమంత్రములు. వివిధ యంత్రములు తంత్ర గ్రంథములలో ఇవ్వబడినవి. మంత్రమునకు వీటి సహకారముతో శీఘ్రముగా ఫలితాలు లభిస్తాయి. అంతేకాక యంత్రము దేవతాశక్తిని నిలువచేసే ఒక కేంద్రము. తంత్ర గ్రంథాలలో చెప్పబడిన యంత్రములలో త్రికోణములు., షట్ కోణములు, పద్మ దళములు, వృత్తములు, భూపురములు మొదలైన రేఖలు ఉంటాయి. ప్రతి యంత్రము చుట్టూ భూపురం ఉండడం సామాన్యం. భూపురం అంటే నాల్గు ప్రధాన దిక్కులందు ద్వారములతో కూడిన చతురస్రపు గోడ. కొన్ని సిద్ధ యంత్రములకు వీటిలో కొన్ని లోపించవచ్చును. వాటిని ఆయా గ్రంథములలో ఇవ్వబడిన పద్ధతిని బట్టి ఉపయోగించు కోవాలి. మామూలుగా ప్రతి యంత్రానికి దశాంగములు ఉంటాయి.

1. యంత్రము మధ్య మంత్రబీజం ఉండాలి.
2. ఎనిమిది దిక్కుల యందు దిక్పాలక బీజములు వ్రాయాలి. (లం, రం, హం, షం, వం, యం, సం, శం. ఇవి తూర్పు దిక్కు మొదలు పెట్టి వ్రాయాలి.
3. ఆగ్నేయమునందు 'అం హ్రీం క్రోం' వ్రాయాలి.
4. నైరృతి యందు 'అం సోహం' అని వ్రాయాలి.
5. వాయవ్యము నందు పంచభూత బీజములు వ్రాయాలి. (లం, వం, రం, యం, హం)
6. ఈశాన్యమునందు 'వషట్' అని వ్రాయాలి.
7. యంత్రము యొక్క శిరస్సు నందు మంత్రబీజమును అధో భాగమున శక్తి బీజమును వ్రాయాలి. (తూర్పు, పడమర)
8. యంత్రములో వామ, దక్షిణ భాగములందు నేత్ర బీజములు ఇం, ఈం శ్రోత్ర బీజములు ఉం, ఊం రాయాలి.
9. యంత్రములోని వివిధ భాగములో దేవతా మంత్రాన్ని లిఖించాలి. మంత్రము లెన్నయినను వ్రాసుకొనవచ్చును.
10. యంత్రములో భూపురమునకు లోపలి భాగమున మంత్ర గాయత్రిని, బయట భాగమున యంత్ర గాయత్రిని లిఖించాలి. లేఖనములన్నీ తూర్పు దిక్కునుండి మొదలు పెట్టాలి.

యంత్రములోనికి దేవతను ఆవాహనం చేయడానికి ప్రాణప్రతిష్ఠా మంత్రమును ముందుగా సిద్ధిపొంది ఉండాలి.

**మంత్రము : ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః అముక దేవతా ప్రాణ ఇహ ప్రాణాః ఆం హ్రీం క్రోం ......**

**అముకదేవతా జీవ ఇహ స్థితః అంహ్రీం క్రోం ... అముకదేవతా సర్వేంద్రియాణి వాఙ్మనశ్చక్షు శ్రోత్ర ఘ్రాణ ప్రాణాః ఇహైవాగత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా ఓం క్షం సం హంసః హ్రీం ఓం** ఈ మంత్రమునకు పురశ్చరణ సంఖ్య ఒక లక్ష – ఏదైనా గ్రహణం వచ్చినపుడు పూర్తి సమయము ఈ మంత్రము చేసినచో ఒక పురశ్చరణతో సమానమగును. కొన్ని సంప్రదాయములలో **1) హంస స్సోహం 2) ఆం సోహం 3) అం హ్రీం క్రోం 4) ఓం క్షంసం హం సః** మంత్రములను ప్రాణప్రతిష్ఠ కుపయోగింతురు. ఇవి చిన్న మంత్రములు. కనుక పురశ్చరణ తొందరగా పూర్తి అవుతుంది. వీనిలో పూజా యంత్రములు, ధారణ యంత్రములు వాని లేఖన విధానము తెలుసుకుని సిద్ధము చేయవలెను.

ప్రయోగ యంత్రములకు మధ్యలో ఉద్దేశించబడిన వ్యక్తిపేరు వ్రాయవలెను. దేవతాయంత్రములలో కొన్ని అక్షరములు అనగా దశాంగములు రాయబడనివి కూడా ఉన్నవి. వీనిలో కొన్ని వట్టి అక్షరముల కూర్పుతో ఉండే యంత్రాలు ఉన్నవి. మరికొన్ని సంఖ్యా యంత్రములు ఉన్నవి. వీనికి యంత్ర దశాంగములతో పనిలేదు. గ్రంధ విస్తర దృష్టి వలన వాటి వివరములు ఇక్కడ ఎక్కువ ఈయబడుటలేదు.

**మంత్ర గాయత్రి :** యంత్రములోని దేవతకు సంబంధించిన గాయత్రి దొరికితే దానిని వ్రాయవలెను. లేనిచో

**"ఓం మంత్ర రాజాయ విద్మహే మహా మంత్రాయ ధీమహి**
**తన్నో మంత్రః ప్రచోదయాత్"** – అని వ్రాయవలెను.

**యంత్రగాయత్రి :** ఓం యంత్రరాజాయ విద్మహే, మహాయంత్రాయ ధీమహి తన్నో యంత్రః ప్రచోదయాత్.

## 74. బలి విధానములు

1) కూష్మాండబలి విధానము

మంచి గుమ్మడికాయకు కుంకుమరాసి సిద్ధం చేయవలెను.

**సంకల్పం :** అముక దేవతా ప్రీత్యర్థం కూష్మాండ బలిదానం కరిష్యే అనవలెను. అముక అన్న చోట దేవత పేరు – కాళి, చండి మొదలగు చెప్పవలెను. దేవతకు

పంచోపచారములతో పూజచేసి దేవతకు ఎదురుగా కాని లేక ఉత్తరముఖముగా గాని నిల్చుండి గుమ్మడికాయను పీటపై పెట్టి ఓత కూష్మండ బలయే నమః- అని బలిపశువును అవాహన చేసి పూలతో, అక్షతలతో పూజచేయవలెను. ఈ క్రింది శ్లోకములను చదవాలి.

**శ్లో॥ పశుస్త్వం బలిరూపేణ మమ భాగ్యా దవస్థితః**
**ప్రణమామి తత స్సర్వ రూపిణం బలిరూపిణం**
**(చండికా) కాళికా ప్రీతిదానేన దాతురాప ద్వినాశనం**
**(చండికా) కాళికా బలిరూపాయ బలే ! తుభ్యం నమోస్తుతే.**
**యజ్ఞార్థం పశవ స్సృష్టాః స్వయమేవ స్వయంభువా**
**అతస్త్వాం ఘాతయా మ్యద్య తస్మాత్ యజ్ఞే వధోఽ వధః**

తరువాత కత్తికికుంకుమరాసి పూలతో, అక్షతలతో పూజించి ఈ క్రింది మంత్రము చెప్పవలెను.

**ఐం హ్రీం శ్రీం రసనాత్వం కాళికాయాః సురలోక ప్రసాధకః హ్రాం హ్రీం ఖడ్గ అం హుం ఫట్** - అని పలుకుతూ కత్తిని చేతిలో పట్టుకొని ఈ క్రింది మంత్రము చెప్పుచూ కండ్లు మూసుకొని గుమ్మడికాయను నరుకవలెను.

**ఓం కాళికాళి వజ్రేశ్వరి లోహదండాయై నమః**

రెండు ముక్కలలో ఒక ముక్కను అమ్మవారి ముందుంచి కుంకుమ, నీరు చల్లి నెత్తురు వలె కనిపించేలా చేసి కౌశికి రుధిరేణ ఆప్యాయతాం - అని సమర్పించవలెను.

మిగిలిన ముక్కను 5 భాగములు చేసి-ఈ క్రింది మంత్రములతో పూజ చేయవలెను.

**1) పూతనాయై బలిం నివేదయామి.**
**2) చర్కాయై బలిం నివేదయామి.**
**3) విదార్యై బలిం నివేదయామి.**
**4) పాపారాక్షస్యై బలిం నివేదయామి.**
**5)** ఓం హ్రీం స్ఫుర స్ఫుర ఓం క్రీం ఓం హుం ఫట్ మర్ద మర్ద హుం - శేషం రక్షోభ్యో హరేత్.

## 2) పశుబలి విధానము

పిండితో జంతువు బొమ్మను చేసి కూష్మాండ బలి పద్ధతిలోనే పిష్ట పశువును అనగా పిండి బొమ్మను నరికి దేవతకు బలి సమర్పించవలెను.

**బలిమంత్రములు**

**1) స్కంధాయ పశ్వర్థం సమర్పయామి**
**2) విశఖాయ పశ్వర్థం సమర్పయామి.**

ఈ మంత్రములతోను మూలమంత్రముతోను దేవతకు సగభాగము సమర్పించి మిగిలిన సగము రాక్షసులకు రక్షోభ్యో నమః అంటూ బయట పారవేయవలెను.

**3) నరబలి విధానము**

మినపపిండితో మనిషి బొమ్మ చేసి పైవిధముగానే దేవతకు బలి సమర్పించవలెను. ఏ మనిషినైన వశీకరణ చేసుకొనుటకు గాని, సంహారమునకు గాని ఆ మనిషి పేరుతో బొమ్మలో ప్రాణప్రతిష్ఠ చేసి పాదముల నుండి శిరస్సు వరకు కత్తితో ముక్కలు చేసి బలిగా సమర్పించవలెను. ఆ బొమ్మను మంత్రించిన కత్తితో 108 ముక్కలు చేసి ఆహుతులు సమర్పిస్తూ హోమం చేసిన కార్యసిద్ధి మరింత వేగముగా జరుగును.

(సంహారమునకు, దుష్టవశీకరణకు ఆవపిండితో బొమ్మను చేసే పద్ధతి ఉన్నది)

**75. మూలికాగ్రహణవిధి**

మంత్రసిద్ధికి, ప్రయోగాలకు మూలికలు ఎంతో ఉపయోగపడతవి. చెట్లు లతలు, వాటి లక్షణాలను తెలుసుకొని వాడుకోవాలి. ఒక చెట్టు మీద మరొక చెట్టు మొలిస్తే పైన మొలిచిన దానిని బదనిక అంటారు. అది చాలా శక్తిమంతమైనది. ఉదాహరణకు రావి చెట్టు, వేప మొదలైన వాటిమీద మొలుస్తవి. సహజంగా ఉన్న చెట్ల కంటె ఇతర చెట్ల మీద మొలచిన వానిలో శక్తి ఎక్కువ.

ఏ మూలికను తీసుకోదలచుకొన్నా ముందు రోజు వెళ్ళి ఆ మూలిక చుట్టూ శుభ్రం చేసి దానిపై పసుపు, కుంకుమ, అక్షతలు చల్లి నమస్కరించి పూజ చేయాలి. ధూప దీప నైవేద్యాలు సమర్పించాలి. అప్పు డీ శ్లోకము పఠించాలి.

**శ్లో॥ బేతాళాశ్చ పిశాచాశ్చ రాక్షసాశ్చ సరీసృపాః**
**అపసర్పంతు తే సర్వే మూలికాం ఈశ్వరాజ్ఞయా**

బేతాళ, పిశాచ, రాక్షస, సర్పాదులన్నీ ఈశ్వరాజ్ఞ చేత ఈ మూలికను విడిచి పెట్టి పోవును గాక !

తరువత మూలికాస్తుతి చేయాలి.

**శ్లో॥ నమస్తేఽమృత సంభూతే బలివీర్యాభివర్ధిని**
**పరమాయుశ్చ మే దేహి పాపాన్మే త్రాహి దూరతః**

మరునాడు నిర్దిష్ట సమయంలో వెళ్ళి తవ్వి వేరును తెచ్చుకోవాలి. తవ్వే గడ్డపారను చేతిని అభిమంత్రించే మంత్రము.

**శ్లో॥ యేన త్వాం ఖనతే బ్రహ్మా యేన త్వాం ఖనతే భృగుః**
**యేన ఇంద్రోఽ ధవరుణో యేన త్వా ముపచక్రమే**
**తే నాహం ఖనయి ష్యామి మంత్రపూతేన పాణినా.**

బ్రహ్మ, భృగువు, ఇంద్రుడు, వరుణుడు దేనితో త్రవ్వేవారో నేను కూడా అట్టి మంత్రపూతమైన చేతితో, వస్తువుతో త్రవ్వుతున్నాను.

**శ్లో॥ మాయే పాతే మాని పాతి, మాతే తేజ్యోన్యథా భవేత్**
**అత్రైవతిష్ఠ కళ్యాణి మమ కార్యకరీభవ**
**మమకర్మకృతే సిద్ధే తతః స్వర్గం గమిష్యసి** – అంటూ

త్రవ్వి తీసి దానిని అవసరమైనన్ని ఖండములు చేసి పూజకు, ధారణకు ఉపయోగించు కొనవచ్చును. దానితో దేవతా విగ్రహములను చేసుకొని వాడుకోవచ్చును.

## హోమద్రవ్యములు

హోమములలో వివిధ ప్రయోజనముల కోసం వివిధ ద్రవ్యాలను ఆహుతులుగా సమర్పించవలసి ఉంటుంది. సాధారణంగా ఉపయోగించే వస్తువులను కొన్నింటిని ఇక్కడ ఇస్తున్నాము.

1) **శాంతి :** ఆవునేయి, పసుపు, కొబ్బరి, తెల్లనిపూలు; మోదుగ, మేడి, రావి సమిధలు.

2) **వశీకరణము :** నువ్వులు, కుంకుమ, ఎర్రని అక్షతలు, జొన్నలు, శనగలు, ఎర్రని పూలు, గేదెనెయ్యి, నువ్వులనూనె, జీలకర్ర.
ఉద్యోగములు, అధికారములు వీటికి కూడ ఇవే

3) **స్తంభనము :** పసుపు, పసుపుచ్చ పూలు, హరితాళము,

4) **ఉచ్చాటనము :** మిరియాలు, నల్లఆవాలు, ఆవనూనె

5) **ఉన్మాదనము :** ఉమ్మెత్త – పుల్లలు, కాయలు, గింజలు, పూలు, ఆకులు

6) **మారణము :** నల్లఆవాలు, మిరియాలు, ఉప్పు, తానికాయలు, ఊడుగ సమిధలు

7) **ఆరోగ్యము :** వేప, మామిడి, సమిధలు, ఆకులు, మారేడు దళములు

8) **ధనము :** తామరపూలు, గన్నేరు మందార మొదలగు ఎర్రపూలు, మారేడు కాయలు, దళములు, సమిధలు

**అన్ని హోమములకు నెయ్యి ప్రధాన ద్రవ్యము.**

# హోమవిధానము

భారతీయ సంప్రదాయములో దేవతలకు సంతృప్తిని కలిగించటానికి హోమము చేయటము అత్యంత ప్రధానమైనది. దేవతలు అగ్నిముఖులు అని వేదములో చెప్పబడినది. అగ్నిని ఆవాహనము చేసి మంత్రపూర్వకముగా ఆహుతులు వేసినచో ఏ దేవతకు వేసిన ఆహుతిని ఆ దేవతకు అగ్నిదేవుడు ఇస్తూంటాడు. ఊర్ధ్వలోకాలలోని దేవతలంతా, హోమప్రియులు, యజ్ఞములలో కూడా హోమము ప్రధానమైన అంగము. వైదికసంప్రదాయములో ఉపనీతుడైన వ్యక్తికి మాత్రమే హోమము చేసే అధికారము ఉన్నది. ఇతరులకు లేదు. కానీ, తరువాత వచ్చిన తంత్రశాస్త్ర గ్రంథములలో ఉపనీతులు కాని స్త్రీపురుషులు దేవతానుగ్రహాన్ని వేగంగా పొందటానికి హోమము చేసే పద్ధతులు కూడా చెప్పబడినవి. ఉపనయనము అయినవారిలో కూడా సస్వరముగా వేదము నేర్చుకొని హోమము చేయగలవారు తక్కువ. అందుచేత అందరికి అందుబాటులో ఉండాలనే ఉద్దేశ్యముతో తంత్రశాస్త్ర గ్రంథాలను పరిశీలించి వీలైనంత క్లుప్తంగా, సులభంగా హోమముచేసే పద్ధతిని ఇవ్వటం జరిగింది. దీనిని చక్కగా ఉపయోగించుకొని మంత్రోపాసకులు శీఘ్రముగా దేవతానుగ్రహాన్ని పొంది తమ ఇష్టకామ్యములను సాధించుకొని, విశ్వ కళ్యాణమును ఇహపర శుభములు సాధించుదురు గాక !

### గణపతి స్తుతి

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

### ఆచమనము

ఓం కేశవాయస్వాహా
ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయ స్వాహా
ఓం గోవిందాయ నమః
ఓం విష్ణవేనమః
ఓం మధుసూదనాయ నమః
ఓం త్రివిక్రమాయ నమః
ఓం వామనాయ నమః
ఓం శ్రీధరాయ నమః
ఓం హృషీకేశాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం సంకర్షణాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం ప్రద్యుమ్నాయ నమః
ఓం అనిరుద్ధాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం నారసింహాయ నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం ఉపేంద్రాయ నమః
ఓం హరయే నమః
ఓం శ్రీకృష్ణాయ నమః

## సంకల్పము

అస్య శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణ దిగ్భాగే – దేశే భగవత్సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన – సంవత్సరే ఆయనే – ఋతౌ – మాసే – పక్షే – తిథౌ – వాసరే – నక్షత్రే శుభయోగే శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్టాయాం మమ-గోత్రోద్భవస్య – శ్రీ ...దేవతా ప్రీతిద్వారా, దేవతానుగ్రహ సిద్ధ్యర్థ్యం శ్రీ ...దేవతా మంత్రహోమం కరిష్యే.

## కలశపూజ

కలశస్యముఖే విష్ణః కంఠే రుద్రస్సమాశ్రితః ।
మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాః స్మృతా॥
కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ।
ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః ॥
అంగైశ్చ సహితా సర్వే కలశాంబు సమాశ్రితాః ।
ఆయాంతు దేవపూజార్థం దురితక్షయ కారకాః ॥
గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు ॥

ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.

ఓం ఆపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్.

## గురుస్తుతి

గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః॥

## మంత్రదేవతాన్యాసము

న్యాసపద్ధతి ఏ మంత్రమున కామంత్రమునకు తెలిసికొని చేయవలెను.

## కరన్యాసము

1. ... అంగుష్ఠాభ్యాం నమః
2. ...తర్జనీభ్యాం నమః
3. ...మధ్యమాభ్యాం నమః
4. ... అనామికాభ్యాం నమః
5. కనిష్ఠికాభ్యాం నమః
6. ..కరతలకర పృష్ఠాభ్యాం నమః

## అంగన్యాసము

1. .. హృదయాయ నమః
2. ....శిరసే స్వాహా
3. ...శిఖాయై వషట్
4. ...కవచాయ హుం
5. ...నేత్రత్రయాయ వౌషట్
6. ...అస్త్రాయఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

## హోమకుండపూజ

కుండమునగానీ, స్థండిలమున గాని సంస్కార చతుష్టయము చేయవలెను. మధ్యలో బియ్యపు పిండితో ప్రాదేశమాత్రపు (బొటనవ్రేలు, చూపుడువ్రేలు చాచినప్పుడు మధ్యలో ఉండు దూరము) చతురసము తయారు చేయవలెను.

**వీక్షణము :** మూలమంత్రమును ఉచ్చరించుచు కుండమును చూడవలెను.

**ప్రోక్షణము :** ఫట్ అని ఉచ్చరించుచు దర్భలతో నీళ్ళు చల్లవలెను.

**తాడనము :** దర్భలతో ఫట్ అని మూడుసార్లు ఉచ్చరించుచు కుండము లోపలి భాగమును కొట్టవలెను.

**అభ్యుక్షణము :** హుం అని ఉచ్చరించుచు పిడికిలితో నీళ్ళు కుండమంతట చల్లవలెను.

మూలమంత్రమును ఉచ్చరించుచు "శ్రీ.... దేవతా కుండాయనమః" అని కుండమునకు నమస్కరించవలెను

తూర్పువైపు దర్భల చివరలు వచ్చుచున్నటుగా పడమట నుంచి తూర్పు వైపుకు మూడు గీతలు బియ్యపు పిండితో దర్భతో గీయవలెను. ఉత్తరపు వైపు దర్భ చివరలు వచ్చునట్లుగా మొదట గీసిన గీతలపై దక్షిణము నుంచి ఉత్తరము వైపు మూడు గీతలు గీయవలెను.

ఆ దర్భలను త్రుంచి నైరుతి దిక్కువైపునకు వేయవలెను.

తూర్పు రేఖల చివరల మూడింటిని - ముకుందాయ నమః, ఈశాయ నమః , పురందరాయనమః అని ప్రదక్షిణ క్రమమున పూజించవలెను.

ఉత్తరాగ్రములలో - బ్రహ్మణేనమః, వైవస్వతాయ నమః, ఇందవే నమః - అని పూజించవలెను.

ఓం హ్రీం ఓం అని కుండమధ్యమున వ్రాసి మూలమంత్రమును ఉచ్చరించుచు పుష్పాంజలి సమర్పించవలెను.

## అగ్ని ప్రతిష్ఠాపనము

హోమాంగత్వేన అగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే - అని సంకల్పం చేయవలెను,..

అస్య శ్రీ వైశ్వానర మహామంత్రస్య భృగు ఋషిః, దైవీ గాయత్రీ ఛందః, శ్రీ వైశ్వానరో దేవతా, రం బీజం, స్వాహా శక్తిః జాతవేద ఇతి కీలకం స్వేచ్ఛాప్రయోగ సిద్ధ్యర్థే హోమే వినియోగః

## అగ్నిన్యాసం (కరన్యాసం, అంగన్యాసం)

1. ఓం రాం సహస్రార్చిషే
2. ఓం రీం స్వస్తిపూర్ణాయ
3. ఓం రూం ఉత్తిష్ఠ పురుషాయ
4. ఓం రైం ధూమవ్యాపినే
5. ఓం రౌం సప్తజిహ్వాయ
6. ఓం రః ధనుర్ధరాయ

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

### అగ్నిపీఠపూజ (కుండములో దశదిక్కుల యందు అక్షతలతో)

1. ఓం పీతాయై నమః
2. ఓం శ్వేతాయై నమః
3. ఓం అరుణాయై నమః
4. ఓం కృష్ణాయై నమః
5. ఓం ధూమ్రాయై నమః
6. ఓం తీవ్రాయై నమః
7. ఓం విస్ఫులింగిన్యై నమః
8. ఓం రుధిరాయై నమః
9. ఓం జ్వాలిన్యై నమః
10. ఓం రం సర్వశక్తి కమలాసనాయై నమ.

అగ్నియోగ పీఠమును పూజించి - బిందువు, త్రికోణము షట్కోణము, అష్టదళము, భూపురముతో కూడిన అగ్నియంత్రమును కుండమునందు భావించవలెను.

## ఆసనపూజ - (అక్షతలతో)

రం వహ్న్యే సనాయనమః - అని అగ్ని ఆసనమునకు సమస్కరించవలెను.

సపరివారం అగ్నిం ఆవాహయామి అని ఆవాహనం చేయవలెను. అగ్నిని మూతగల పాత్రలో 'ఫట్ ఫట్' అని ఉచ్చరించుచు తెచ్చి, 'హుం - హుం' అని మూత తీసి, 'రం రం' అని ఉచ్చరించుచు కుండము దగ్గరకు తీసుకొని రావలెను.

పరమాత్మానలముతోను, జఠరాగ్నితోను, అంతరాగ్నితోను ఈ అగ్నియొక్క సమైక్యమును సంభావించి, అగ్ని బీజమగు రం ఉచ్చరించుచు వహ్ని చైతన్యమును భావించవలెను.

అగ్నిని ఓంకారముతో అభిమంత్రించి, ఉచ్చరించుచు అమృతబీజమైన వం-తో అమృతీకరించి ఉచ్చరించుచు ఈ అగ్ని లలాటం నుండి కుండములోనికి దిగుచున్నట్లుగా భావించి, ఎనిమిదిసార్లు ప్రణవముతో మరల అభిమంత్రించి హుం ఫట్ అని రక్షాకవచమును భావించి "రం వహ్నిమూర్తయే నమః" అని మనస్సులో అగ్నికి నమస్కరించి ఓం ఓం ఓం అని ఉచ్చరించుచు కుండముపై నిప్పు పళ్ళెమును ప్రదక్షిణ పద్ధతిలో మూడుసార్లు త్రిప్పవలెను.

హూంఫట్ క్రవ్యా దేభ్యః స్వాహా అనుచు కొంత నిప్పు తీసి నైరుతి దిక్కున వేయవలెను.

భూర్భువస్సువరోం అనియు, హ్రూం -వహ్ని చైతన్యాయ నమః, అనియు ఉచ్చరించుచు కుండమున అగ్నిని ఉంచవలెను.

కుండము బైట (నిప్పు పళ్లెములో) అక్షింతలు, నీళ్ళు వదలవలెను. చిత్పింగళ హనహన దహదహ పచపచ సర్వజ్ఞ ఆజ్ఞాపయ స్వాహా. హ్రీం హ్రీం జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల హుంఫట్ స్వాహా - అని మంత్రములను పఠించవలెను. అంతట లేచి నిలుచుండి జ్వాలినీముద్ర ప్రదర్శించి నమస్కరించుచు

అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదం హుతాశనం ।
సువర్ణ వర్ణ మమలం సమిద్ధం విశ్వతోముఖం ॥

ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ స్వాహా అనుచు అర్ఘ్యపాద్యములతో పూజించవలెను.

## పంచపూజ

వంజలతత్వాత్మికాయ నమః పాద్యం సమర్పయామి అర్ఘ్యం సమర్పయామి ఆచమనం సమర్పయామి

| | |
|---|---|
| లం పృథివీ తత్వాత్మికాయ నమః | గంధం ధారయామి |
| హం ఆకాశతత్వాత్మికాయ నమః | పుష్పైః పూజయామి |
| యం వాయు తత్వాత్మికాయ నమః | ధూపం అఘ్రాపయామి |
| రం తేజస్తత్వాత్మికాయ నమః | దీపం దర్శయామి |
| ధూపదీపానంతరం | ఆచమనం సమర్పయామి |
| అం అమృతతత్వాత్మికాయ నమః | అమృత నైవేద్యం సమర్పయామి |

అని పూజచేసి

దర్భ కాల్చి జ్వాలను నేతిలో ప్రతిఫలింజేసి, దర్భను కుండములో వేయవలెను, నేతిపాత్రలో రెండు చిన్న దర్భాగ్రములు వేయవలెను. అపుడు నెయ్యి మూడు భాగములు అగును. ఎడమవైపు ఇడ కుడివైపు పింగళ, మధ్య సుషుమ్న అని భావించవలెను.

స్రువముతో కుడిభాగము నుండి 'నమః' అని నేతిని తీసుకొని ఓం అగ్నయే స్వాహా - అని ఆహుతి వేయుచు అగ్ని యొక్క కుడికన్ను తెరువబడినట్లుగా భావించవలెను.

స్రువముతో ఎడమభాగము నుండి 'నమః' అని నేతిని తీసుకొని ఓం సోమాయస్వాహా - అని ఆహుతి వేయుచు అగ్ని యొక్క ఎడమకన్ను తెరువబడినట్లుగా భావించవలెను.

స్రువముతో మధ్యభాగము నుండి 'నమ' అనుచు నేతిని తీసుకొని ఓం అగ్నీషోమాభ్యాగ్ం స్వాహా - అని ఆహుతి వేయుచు ఫాలనేత్రము తెరువబడినట్లుగా భావించవలెను.

కుడివైపు నుండి 'నమః' అని నేతిని తీసుకొని ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా - అని అగ్ని ముఖమున ఆహుతి వేయవలెను.

మధ్యభాగమునుండి ఓం భూఃస్వాహా, ఓం భువః స్వాహా, ఓం సువః స్వాహా, ఓం భూర్భువస్సువః స్వాహా - అని ఆహుతులు వేయవలెను.

ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వ కర్మాణి సాధయస్వాహా - అని మూడుసార్లు ఆహుతలు వేయవలెను.

## జిహ్వాహోమము (సాత్త్విక జిహ్వాలు)

1. ఓం స్ర్యూం హిరణ్యాయై స్వాహా
2. ఓం ష్ర్యూం గగనాయై స్వాహా
3. ఓం శ్ర్యూం రక్తాయై స్వాహా
4. ఓం వ్ర్యూంకృష్ణాయై స్వాహా
5. ఓం ల్ర్యూం సుప్రభాయై స్వాహా
6. ఓం ర్ర్యూం అతిరక్తాయై స్వాహా
7. ఓం య్ర్యూంబహురూపాయై స్వాహా

## రాజస జిహ్వాలు

1. ఓం స్ర్యూం పద్మరాగాయై స్వాహా
2. ఓం ష్ర్యూం సువర్ణాయై స్వాహా
3. ఓం శ్ర్యూం భద్రలోహితాయై స్వాహా
4. ఓం వ్ర్యూం లోహితాయై స్వాహా
5. ఓం ల్ర్యూం శ్వేతాయై స్వాహా
6. ఓం ర్ర్యూం ధూమిన్యై స్వాహా
7. ఓం య్ర్యూం కరాళికాయై స్వాహా

## తామస జిహ్వాలు

1. ఓం స్ర్యూం విశ్వమూర్త్యై స్వాహా
2. ఓం ష్ర్యూం స్ఫులింగిన్యై స్వాహా
3. ఓం శ్ర్యూం ధూమ్రవర్ణాయై స్వాహా
4. ఓం వ్ర్యూం మనోజవాయై స్వాహా
5. ఓం ల్ర్యూం లోహితాయై స్వాహా
6. ఓం ర్ర్యూం కరాళ్యై స్వాహా
7. ఓం య్ర్యూం కాళ్యై స్వాహా

సాత్త్విక రాజస తామస జిహ్వాలు ఇష్టప్రాప్తి, అనిష్ట పరిహారము అభిచార ప్రయోజనములకు ఉద్దేశించబడినవి.

## జిహ్వాధి దేవతాహోమము

1. ఓం సురేభ్యః స్వాహా
2. ఓం పితృభ్యః స్వాహా
3. ఓం గంధర్వేభ్యః స్వాహా
4. ఓం యక్షేభ్యః స్వాహా
5. ఓం నాగేభ్యఃస్వాహా
6. ఓం పిశాచేభ్యః స్వాహా
7. ఓం రాక్షసేభ్యః స్వాహా

## షడంగ దేవతా హోమము

1. ఓం రాం సహస్రార్చిషే హృదయాయ నమః
2. ఓం రీం స్వస్తిపూర్ణాయ శిరసే స్వాహా
3. ఓం రూం ఉత్తిష్ఠ పురుషాయ శిఖాయై వషట్
4. ఓం రైం ధూమవ్యాపినే కవచాయ హుం

5. ఓం రౌం సప్తజిహ్వాయ నేత్రత్రయాయ వౌషట్
6. ఓం రః ధనుర్ధరాయ అస్త్రాయ ఫట్

## అష్టమూర్తి హోమము

1. ఓం అగ్నయే జాతవేదసే స్వాహా
2. ఓం అగ్నయే సప్తజిహ్వాయ స్వాహా
3. ఓం అగ్నయే హవ్యవాహనాయ స్వాహా
4. ఓం అగ్నయే అశ్వోదరజాయ స్వాహా
5. ఓం అగ్నయే వైశ్వానరాయ స్వాహా
6. ఓం అగ్నయే కౌమారజాతసే స్వాహా
7. ఓం అగ్నయే విశ్వముఖాయ స్వాహా
8. ఓం అగ్నయే దేవముఖాయ స్వాహా

## అష్టమాతృకాహోమము

1. ఓం ఆం బ్రాహ్మ్యై స్వాహా
2. ఓం ఈం మహేశ్వర్యై స్వాహా
3. ఓం ఊం కౌమార్యై స్వాహా
4. ఓం ఋూం వైష్ణవ్యై స్వాహా
5. ఓం వారాహ్యై స్వాహా
6. ఓం ఐం ఇంద్రాణ్యై స్వాహా
7. ఓం ఔం చాముండాయై స్వాహా
8. ఓం అః మహాలక్ష్మ్యై స్వాహా

## అష్టభైరవహోమము

1. ఓం అం అసితాంగ భైరవాయ స్వాహా
2. ఓం ఇం రురు భైరవాయ స్వాహా
3. ఓం ఉం చండ భైరవాయ స్వాహా
4. ఓం ఋం క్రోధ భైరవాయ స్వాహా
5. ఓం లుం ఉన్మత్త భైరవాయ స్వాహా
6. ఓం ఐం కపాల భైరవాయ స్వాహా
7. ఓం ఓం భీషణ భైరవాయ స్వాహా
8. ఓం అః సంహార భైరవాయ స్వాహా

## దిక్పాలక హోమము

1. ఓం లం ఇంద్రాయ స్వాహా 2. ఓం రం అగ్నయే స్వాహా
3. ఓం హం యమాయ స్వాహా 4. ఓం ష నిర్రుతయే స్వాహా
5. ఓం వం వరుణాయ స్వాహా 6. ఓం వం వాయవే స్వాహా
7. ఓం సం సోమాయ స్వాహా 8. ఓం శం ఈశానాయ స్వాహా
9. ఓం అం బ్రహ్మణే స్వాహా 10. ఓం హ్రీం అనంతాయ స్వాహా

## దిక్పాలకాయుధ హోమము

1. ఓం వజ్రాయ స్వాహా
2. ఓం శక్త్యై స్వాహా
3. ఓం దండాయ స్వాహా
4. ఓం ఖడ్గాయ స్వాహా
5. ఓం పాశాయ స్వాహా
6. ఓం అంకుశాయ స్వాహా
7. ఓం గదాయై స్వాహా
8. ఓం శూలాయ స్వాహా
9. ఓం పద్మాయ స్వాహా
10. ఓం చక్రాయ స్వాహా

స్రువముతో నాలుగుసార్లు నేతిని తీసుకొని స్రుక్కునందు వేసి స్రువమును స్రుక్కుపై బోర్లించి దానియందు ఒక పువ్వును ఉంచి రెండు చేతులతో వామస్తనము ఎత్తువరకు పట్టుకుని లేచి కుడికాలు ముందుకు వేసి

"ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ వౌషట్" అని హోమము చేయవలెను.

కూర్చుని నమస్కరించి చేతిలో అక్షతలు నీళ్ళు తీసుకొని కుండమునకు (అగ్నికి) తూర్పున నీళ్ళు మాత్రమే ఉంచి పశ్చిమాన అక్షతలు వేయవలెను.

ప్రాఙ్ముఖాగ్నే మమ అభిముఖోభవ, సుముఖోభవ
సుప్రసన్నోభవ, వరదో భవ, యధోక్త జిహ్వాయా
హవిర్గృహాణ ॥ఓం భూర్భువస్సువః – అని నీళ్లు చల్లి నీళ్ళతో అగ్నికి చుట్టూ ప్రదక్షిణ పద్ధతిన త్రిప్పవలెను.

## కుండమేఖలా పూజ

1. తూర్పున – అగ్నయే నమః
2. అగ్నేయాన – హుతవహాయ నమః
3. దక్షిణాన – హుతాశినే నమః

4. నైరుతిన – కృష్ణవర్మనే నమః
5. పశ్చిమాన – దేవముఖాయ నమః
6. వాయవ్యాన – సప్తజిహ్వాయ నమః
7. ఉత్తరాన –వైశ్వానరాయ నమః
8. ఈశాన్యాన – జాతవేదసే నమః

అనుచు ఎనిమిది దిక్కులయందు అక్షతలతో కుండముపై పూజ చేయవలెను. దర్భల కొసలు తూర్పు వైపునకుగానూ, ఉత్తరవైపునగానూ ఉండేటట్లు నాలుగు వైపుల వేయవలెను.

## మహా గణపతి హోమము

1. ఓం స్వాహా ।
2. ఓం శ్రీం స్వాహా ।
3. ఓం శ్రీం హ్రీం స్వాహా ।
4. ఓం శ్రీం హ్రీం క్లీం స్వాహా।
5. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం స్వాహా ।
6. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం స్వాహా ।
7. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే స్వాహా ।
8. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరదస్వాహా ।
9. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశం స్వాహా।
10. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వ జనం మే వశమానయ స్వాహా

పిమ్మట నాలుగు పర్యాయములు పూర్తి గణపతి మంత్రముతో ఆహుతులు వేయవలెను.

## ప్రధాన దేవతా హోమము

శ్రీ గురుభ్యో నమః అని గురువునకు నమస్కరించి ఓం శ్రీం దేవతాయోగ పీఠాయ నమః అని ఒక మారు ఆహుతిగానీ, అక్షతలు గానీ వేయవలెను.

మూలమంత్రమును పదిసార్లు ఉచ్చరించి దానితో దేవతను అగ్నియందు అవతరింప చేయవలెను. దేవతా యంత్రమును కుండమునందు భావించి దేవతా

ప్రాణ ప్రతిష్ఠ చేయవలెను.

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః ...దేవతా ప్రాణా ఇహ ప్రాణాః

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః..దేవతా జీవ ఇహ స్థితః

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః ...దేవతా సర్వేంద్రియాణి వాఙ్మనః చక్షుశ్శోత్ర ఘ్రాణ ప్రాణా ఇహైవ ఆగత్య సుఖం చిరంతిష్ఠంతు స్వాహా ఓం క్షం సం హం సః హ్రీం ఓం

పై మొత్తమును మంత్రమును మూడుసార్లు జపించుచు కుండముపై చేయి వుంచి ప్రాణప్రతిష్ఠ చేయవలెను. ఆ తరువాత లమిత్యాది పంచపూజ చేయవలెను. (స్త్రీ పురుష దేవతలకు విశేషణములకు విభక్తులు చూచి వాడవలెను.)

అగ్నికి దేవతకు వక్త్ర ఏకీకరణమును సంకల్పించి మూలమంత్రముతో 25 ఆహుతులు వేయవలెను. నాడీ సంధానమును సంకల్పించి మూలమంత్రముతో 11 ఆహుతులు వేయవలెను. ఇప్పటికి అగ్నికి దేవతకు ఏకీకరణము జరిగినట్లుగా భావింపవలెను.

ఓం మండూకాది వరతత్వాంత పీఠదేవతాభ్యఃస్వాహా - అని ఒక ఆహుతి వేయవలెను.

పీఠదేవతలకు, ఆవరణ దేవతలకు హోమము చేయవలెను. మూలమంత్రముతో 10 ఆజ్యాహుతులు వేయవలెను. ఆ తరవాత కామ్య ద్రవ్యముతో హోమము చేయవలెను.

అగ్ని, దేవతా సంధానము చేయబడినది గనుక హోమములలో "ఇదంనమమ" అని త్యాగము చెప్పవలసి పనిలేదు.

మంత్రము చివర అదనముగా స్వాహా అని ఉచ్చరించుచు ఆహుతులు వేయవలెను. కార్యసిద్ధిని బట్టి ఆహుతుల సంఖ్యను నిర్ణయింపవలెను.

హోమ పరిపూర్ణత కొరకు జయాది మంత్రములతో హోమము చేయవలెను. జయాదుల బదులుగా మహావ్యాహృతి హోమము, బ్రహ్మార్పణ మంత్రహోమము చేయవచ్చును.

## మహావ్యాహృతి హోమము

ఓం భూః అగ్నయే చ పృధివ్యైచ మహతే చ స్వాహా

ఓం భువః వాయవే చ అంతరిక్షాయ చ మహతే చ స్వాహా

ఓం సువః ఆదిత్యాయ చ దివే చ మహతే చ స్వాహా

ఓం భూర్భువస్సువః చంద్రమసేచ నక్షత్రేభ్యశ్చ దిగ్భ్యశ్చ మహతేచ స్వాహా

## బ్రహ్మార్పణ మంత్రహోమము

ఓం తత్సత్ ఇతః పూర్వం ప్రాణబుద్ధి దేహ ధర్మాధికార జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థాసు మనసా వాచా కర్మణా యత్ స్మృతం యదుక్తం యచ్చకృతం తత్సర్వం బ్రహ్మార్పణం భవేత్. భూః స్వాహాః అనుచు ఎనిమిది ఆహుతులు వేయవలెను.

## పూర్ణాహుతి

పూర్ణాహుతిని సంకల్పించి 'పూర్ణాహుతిం జుహోమి' అని అనవలెను.

పళ్ళెమునందు కొబ్బరికాయగానీ, ఖర్జూరపు కాయగానీ, పోకకాయగాని ఉంచి అక్షతలు, జాజికాయ, పట్టుగుడ్డ, పూలు, జాపత్రి మున్నగు సుగంధ ద్రవ్యాలను పూర్ణాహుతికి ఉపయోగించవచ్చును. పూర్ణాహుతి ద్రవ్యాన్ని ఒక దేవతగా భావించి ధూపదీప నైవేద్యములను సమర్పించవలెను. 12 సార్లు మూలమంత్రముతో నేతిని తీసుకొని పూర్ణాహుతి ద్రవ్యపు కాయపై పోయవలెను. ఈ సందర్భమున స్రుక్కునందు స్రువముతో 12సార్లు నేతిని వేసి పూర్ణాహుతి చేయుట ఆచారము.

లేచి నిల్చుండి మూలమంత్రమును వౌషట్ అంతముగా ఉచ్చరించుచు పూర్ణాహుతి ద్రవ్యాన్ని హోమకుండము నందు ఉంచవలెను. ఇంతటితో పూర్ణాహుతి పూర్తి అయినది.

హోమసమయాన అగ్నిజ్వాలతో బాగా విజృంభించునట్లు చూచుకొనవలెను. అయినను అప్పుడప్పుడు వాడిన ద్రవ్యాలను బట్టి జ్వాలలు బాగా ఉండకపోవచ్చును. కనుక, అగ్నివిహరణ దోషనిరసనార్థము మూలమంత్రముతో 25 ఆజ్యాహుతులను వేయవలెను.

ఆవరణ దేవతలకు ఆహుతులు వేయవలెను.

## దేవతా ఉద్వాసనము

గచ్ఛ గచ్ఛ భవత్ స్థానం కార్యం కృత్వా మమేశ్వర (రి)

యత్ర బ్రహ్మాదయోదేవాః నవిదుః పరమం పదం॥

## అగ్నిఉద్వాసనము

గచ్ఛ త్వం భగవన్ వహ్నే స్వస్థానం కుండమధ్యతః।
యత్ర బ్రహ్మాదయో దేవాః తత్ర గచ్ఛ హుతాశన॥
అనేన మయా కృతేన హోమేన శ్రీ ....దేవతా సుప్రసన్నో (న్నా) వరదో (దా) భవతు అని కుండముతో నీళ్ళు అక్షతలతో కలిపి పదలవలెను.

సువర్ణు వర్ణూరోమితి దిగ్విమోకః అని దిగ్విమోచనము చేయవలెను.

## దిక్పాలకబలి

నమస్కారము చేసి దిక్పాలికబలి వేయవలెను. కుంకుమతో 11 ముద్దలు అన్నముతో బలివేయవలెను. దిక్పాలకులకు నమః అనుచు బలి సమర్పించవలెను. ఈశాన్య దిక్కున పెద్ద ముద్ద (11వది భూతబలి).

యే రౌద్రా రౌద్రకర్మాణో రౌద్రస్థాన నివాసినః
యోగినోహ్యుగ్రరూపాశ్చ గణానాం అధిపాశ్చయే
భూచరాః ఖేచరాశ్చైవ యే తిష్ఠంత్యంతరిక్షగాః
తేసర్వే ప్రీతమనసో భూత్వా గృహ్ణం త్విమం బలిం
సర్వ విఘ్నకృద్భ్యః సర్వభూతేభ్యో హుంఫట్ స్వాహా

అని చెప్పుచూ నీళ్ళు వదలవలెను. ఇక్కడ కొబ్బరికాయను భూతబలి కొరకు ఉపయోగించవచ్చును.

దిక్పాలక బలిక్రింద మినుములు, పెరుగు కలిపి యిచ్చుట కొన్నిచోట్ల ఆచారము. నిమ్మకాయ కోసి కుంకుమ అద్ది కూడ ఇయ్యవచ్చును.

కుండభస్మమును నొసట ధరించి దేవతాప్రసాదమును స్వీకరించవలెను.

**గమనిక :**

1) **స్రువము :** చంద్రకొయ్యతో చేసిన చిన్నమూతిగల మూరెడు పొడవు గరిటె.
**స్రుక్కు :** అదే రకమైన పెద్ద మూతిగల గరిటె

2) హోమము చేయునప్పుడు ఆజ్యము మొదలగు ద్రవములను స్రువముతో వేయవలెను. ఇతరవస్తువులను మృగముద్రతో వేయవలెను.
**మృగముద్ర –** బొటన, మధ్య, ఉంగరపు వేళ్ళు కలుపుట వీనితో పదార్థము ఎంత వస్తే అంత ఆహుతి పరిమాణము.



పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు,

## శ్రీసిద్ధేశ్వరానంద భారతీస్వామి

| | | |
|---|---|---|
| తమిళనాడు | : | శ్రీసిద్ధేశ్వరీపీఠం, కుర్తాళం |
| గుంటూరు | : | స్వయంసిద్ధ కాళీపీఠము, శ్రీనాథపీఠము, మంత్రాశ్రమము |
| విజయవాడ | : | త్రిపురసుందరీపీఠము |
| నెల్లూరు | : | దత్తాత్రేయాశ్రమము |
| విశాఖపట్టణం | : | శ్రీ లలితాపీఠము |

మొదలగు పీఠములకు అధిపతి, అనేక దేవాలయములకు అధ్యక్షులు

స్వామివారు మహాయోగి, మంత్రసిద్ధులు, రాధాదేవి, కాళీదేవి, కాలభైరవుడు ఇత్యాది దేవతల సాక్షాత్కారముపొందిన మహనీయులు. కొన్ని వేలమందికి మంత్రోపదేశము చేసి వారికి ఆధ్యాత్మిక చైతన్యము కలిగించారు. హోమప్రక్రియ యొక్క ప్రాధాన్యాన్ని ప్రచారం చేసి బాధానివారణ, అభీష్ట సిద్ధి ఎలా పొందవచ్చునో నిరూపించిన తపోనిధి.

రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాలలో దేశ విదేశాలలో హిందూధర్మరక్షణకు యాగాలు చేస్తూ ధర్మప్రచారం చేస్తున్న దివ్యశక్తి సంపన్నులు. వ్రజభాగవతము, బృందావన భాగవతము, బృందావన యోగులు, కాళీసిద్ధులు, సిద్ధాశ్రమయోగులు, లలితాదేవిచరిత్ర, భైరవ సాధన, నాగసాధన మొదలైన అద్భుత గ్రంథాలు రచించిన విద్వత్కవిచక్రవర్తి.